9 నిధమా * ,, | ,, | నీ నీ - ధనిసా ||
... * ,, | ,, | సుఖ - మా.. ||

10 ; * ని సని - ధమా - గమపమగారి - సాసా | ,, | ,, ||
; * ద్వై . - తము - సు. . . ఖ . - మాఅ | ,, | ,, ||

అ. ; * నిసని - నిధమ - గమగరీ - గమా | ; - నినిసని - ధని | సానీ - సాంసా ||
; * చై. ; - త . న్య - మా. . . - విను | ; - సర్వ. - సా | ,. . , - క్షి వి ||
; * సనిగరిసా - నిసనిధనిసా | ; - నిసని - ధసా | గమపమ - గ రిగా ||
; * సా. ర. ము - గా. . . ను | ; - దె. . - ల్పుము | నా. . . - జో. . ||

; *
; * (ద్వైతము సుఖమా).

చ. ; * పపాపమా - గమపమ - గరిగా | ; - మధాపమా | గమపమ - గరిసా ||
; * గ గ న ప - వ . . న - తపన | ; - భువనా . | వే . ను . - ల లో ||

; * నిస్నీస - గాగామా - పమగా | ; - గమా - పమా | పమగరి - గామా ||
; * నగధ - రాఅజ - శి. వేం | ; - ద్రా. - దిసు | య. . . - లలో ||
; * నిసని - నిధప - గమగరీ గ్గమా | ; - నీసనిధా | నీ నీ - సాసా. ||
; * భగ . - వ . . - ద్భ. క్త. - వరా. | ; - గ్రే. . . | సరు - లలో ||
; * సనిగరిసా - ని సనిధనీసా | ; - నిసనిధమా | గానుపప - గరి ||
; * బా. . . గు - క .ర.మించు | ; - త్యా.గరా | జా . . . - ర్చిత ||
, * గమా పమా గారీసా ; |
; * దైన్య తము సుఖమా ; | ఇచ్చట నిలుపవలయును.



ఆనతారిక:—ఇందు త్యాగయ్యగారు, శ్రీరామా! మిక్కిలి దైన్యము నొందిన నన్ను నా కోర్కెలీడేర్చి కటాక్షించి రక్షింపవలసియుండఁగా వీరులగు శత్రుపులకడఁ జూపఁదగిన నీ ధైర్యమంతయు నాకడనే చూపుచున్నావు. యుక్తాయుక్త పరిజ్ఞానము గల నీకు ఇది మేరగాదను చున్నారు.

(4) రా. రీతిగౌళ - తా. ఆది.

ప. చేరరావదేమిరా రామయ్య (చే)

అ. మేరగాదురా యిఁక మహా-మేరుధీర శ్రీకర (చే)

చ. తలిదండ్రులు లేని బాల-తననాథుఁగోరురీతిఁ-బలుమారు వేఁడుకొన్న-బాలింపరాదా
వలచుచు నేను నీదు-వదనారవిందమును-దలఁచి కరఁగఁగఁ జూచి-త్యాగరాజనన్నుత (చే)

ప్రతిపదార్థము.

మేరగాదురా - న్యాయము గాదురా
మహామేరుధీరా - గొప్ప మేరుపర్వతమువంటి ధైర్యము గలవాఁడా.
శ్రీకరా - సంపద గల్గించువాఁడా
రామయ్యా - రామా
చేరరావదేమిరా - దగ్గఱకు రాకదేందుకురా
ఇఁకఁ - ఇఁకమీఁద
తలిదండ్రులు లేని బాల-తల్లియుఁ దండ్రియు లేనట్టి ఒక బాలిక
తన నాథుఁ - తన పెనిమిటిని
కోరురీతిఁ - కోరినచందముగా
నాలస్యరక్షణయములు

వేడుకొనఁగ - ప్రార్థించినప్పటికిని
పాలింపరాదు (ఆ-కాపాడఁగూడదా
నేను - నేను
కలచుచుఁ - ఆశగొనుచు,
త్యాగరాజ సన్నుత - త్యాగరాజుచే కొనియాడఁబడు
శ్రీ రామా

నీదు వదనారవిందమును - తామరపుష్పమువంటి నీయొక్క ముఖమును.
తలఁచి - స్మరించి
కరఁగఁ కఁగ - నా మనస్సు నీరై పోఁగా
చూచి - చూచి
(చేరఁదావు అదేమి).

విశేషార్థము :—లోకములో స్త్రీలకు 'పతిరిహాపైవతం నార్యాః పతిర్బంధుః పతిర్గురుః' అనునటులు భర్తయే దైవము, బంధువు, గురువు, సకలముగ నున్నను తమకు తలిదండ్రులున్న యెడల తమ్మును తమభర్త యనాదరించినను తలిదండ్రులయండఁ జేరుదురు. అందుు వయసు చెల్లిన వారుగ నున్నను ధైర్యమయిన నవలంబింతురు. అట్టి సౌకర్యములు లేని బాలిపై పెనిమిటికోపించినచో నా బాలిక యేమి చేయఁగలదు? కొట్టినను, తిట్టినను, పెట్టను వేఁచుక పట్టుటుండుగదా? అటులే అనన్యగతికుఁడనై నిన్ను సేవింపవలయునని యాశగొని మనస్సాతో త్యాగమైన సన్ముఖారవిందమును కంటఁజూచుటకై తలఁచితలఁచి నీరుపలె కరఁగుచుండు నన్ను చూచియు, పర

దుఃఖమునుజూచి దుఃఖమొందవలసిన నిన్ను, కదలక మెదలక మహామేరువువలె నెంతో ధైర్యముగ నున్నావు. ఇంతవఱకుఁ గడచినది. ఇక న్యాయము గాదు. వలయున (భక్తార్తిభంజన శ్రీమాక్ కృష్ణవవ గతిర్మమ) అనునటులు భక్తులయొక్క దుఃఖమును పోఁగొట్టుట నీకు ముఖ్య లక్షణమై యుండ దానిగాపాడుకొనకుండుటయే గాక నేను తిఱిఁగి యశించినయెడల నాత్మలాభ మొందవలసిన నీకు నష్టముగూడఁ గలుగుచున్నది. కాన శీఘ్రముగ దర్శనమిమ్మని అయ్యగారు సూచ్చరిక చేయు చున్నారని భావము.

ప. ; ; ; * ధాపా - మా ; గా | గాసా ; - సా | నీ ; ; - నీ ||
; ; ; * చేర - రా ; వ | దే . ; - మి | రా ; ; - రా ||

2. సా గా మా * ధాపా గమపమగరి | గగాసా , - సని | సా ; ; - నీ ||
మ య్యా . * చేర రా. . . వ. | దే . . , - మి | రా ; ; - రా ||

3. సా గా మా * పా ధా సా ; - మ గ | మా ; ; - గ రి | గ గ రీ ; - నీ ||
మ య్యా . * చే రా రా ; - వ . | దే ; ; - మి. | రా . . ; - రా ||

అవతారిక :—ఇందు త్యాగయ్యగారు భగవంతునకు నానాలంకారః సమర్పించి ఆసేవకై భాగవతోత్తములనెల్లరను, పిలుచుచున్నారు.

(5) రీతిగౌళ - చతురశ్ర రూపకము.

ప. రాగరత్నమాలికచే రంజిల్లునట, హరి, శత, (రాగ)

అ. బాగుగ సేవించి; సకలభాగ్యము నొందుదము రారే! (రాగ)

చ. నైగమషట్ఛాస్త్ర పురాణాగమార్థసహితమట;
యోగివరులు ఆనందము నొందెడు సన్మార్గమట;
భాగవతోత్తములు గూడి బాడెడి కీర్తనములట;
త్యాగరాజు కడ తేఱ, దారకమని చేసిన శత (రా)

ప్రతిపదార్థము.

హరి - భగవంతుడు
శత రాగరత్నమాలికచేత - అనేకరాగములనెడు రత్నముల దండచేత
రంజిల్లున్ అట - ప్రకాశించునట
బాగుగన్ - చక్కగ
సేవించి - సేవించి

సకలభాగ్యము – సమస్తసంపదలు
ఒందుదము – పొందుదము
రారే – రండుసుమా
'నైగమ...సహితము
నైగమ – వేదసంబంధమగు
షట్శాస్త్ర – ఆరుశాస్త్రములు
పురాణ – పురాణములు
ఆగమ – పాంచరాత్రాద్యాగమములయొక్క
అర్థ – అర్థములతోటి
సహితముఅంట – కూడికొన్నదంట
యోగివరులు – యోగాభ్యాసపరులు

ఆనందము – సంతోషము
ఒందెడు సన్మార్గములంట – పొందెడు మంచిత్రోవలు
భాగవతోత్తములు – భాగవతశ్రేష్ఠులు
కూడి – కూడి
సాంకేతిక కీర్తనములు అంట – పాడునట్టి కీర్తనములంట
త్యాగరాజు – త్యాగరాజు
కడతేరగ – కృతార్థుడగునటుల
తారకము అని – సంసారమును దాటించునదియని
చేసినసర్వరత్నమాలికచేత – ఒనర్చినట్టి అనేకరాగముల
నెడి పుష్పాల దండచేత

విశేషార్థము :—భగవంతుడు 'స్ఫురత్కిరీటాంగదహారకంకణ' అనునటుల, కిరీటము భుజకీర్తులు, హారములు, కంఠే, నవరత్నఖచితమగు మొలనూలు, కాలియందెలు, మొదలగు యాభరణములచే నమరియున్నను, త్యాగరాజుసమర్పించిన రాగరత్నమాలికచే మిక్కిలి ప్రకాశింపుచుండును,

వలయున; ఈమాలికయందు వేదవేదాంతములయం దిమిడియున్న రహస్యార్థముల నెల్ల కీర్తనలుగఁ జేసి అట్టి కీర్తనలను రాగములతోడఁ బొందుపఱచి, ఆ రాగముల నెడి రత్నములతో నమరియుండుట చేత సంసార సముద్రమును దాటింపజేయునదియై యున్నది.

ఈమాలికను అయ్యగారు భగవంతున కర్పణమొనరించెను. దానిని ధరించిన భగవంతుఁ సేవ యవాఙ్మానస గోచరమనియే జెప్పవలయును, వలయు! ఒకొ్కక జీవుఁడును సంసార సముద్రమునుండి దాటుటకై నుపాయమును వెదకువాఁడు అట్టివానికి మణిమంత్రౌషధములలొ నొకటిదొరకినటుల ఈ తారకహారము దొరకిన తోడనే వానిసంతోషమునకు మితిలేదని భావము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. నీధా | \| మాగారీసా | \|\| | స్నీ్ఫా | \| స్నీ్నీసా ; | \|\| |
| రా | \| గర . త్న . . | \|\| | మా. | \| లిక చే ; | \|\| |
| ; స్నీ | \| సా - గ్గారీగా | \|\| | మానూ | \| నీనీసాసా | \|\| |
| ; రం | \| . - జి . ల్లు | \|\| | న ట | \| హారిశ తి | \|\| |
| 2. నీదా | \| మా - గారీసా | \|\| | స్నీ్ఫా | \| స్నీ్నీసా ; | \|\| |

| | | | | |
|---|---|---|---|---|
| ; గాం | గాంగాంగాం రి | ‖ గమగరి | సాం ; సాంసాం | ‖ |
| ; రా | గి వ రు లు | ‖ ఆ . . . | నం ; ద ము | ‖ |
| నిసనిధ | మామా - గారీ | ‖ గామా | నీనీసాం ; | ‖ |
| నొం. | దె డు - సక | ‖ మా . | ర్గముట ; | ‖ |
| నీధా | మాగారీసా | ‖ సీ ధా | సీ సీ ; సా | ‖ |
| భా. | గ వ తో. | ‖ త్తము | లుగా ; డి | ‖ |
| ; సీ | సాగా ; మా | ‖ గామా | సి సీ సాం ; | ‖ |
| ; పా | డి డి ; కీ | ‖ ర్తన | ములట ; | ‖ |
| ; గాం | గాంగాం ; రిం | ‖ గమగరి | సాం ;; సాం | ‖ |
| ; త్యా | గ రా ; జు | ‖ క . డ . | తే ;; అ | ‖ |
| గరిసాం | నిధమాగారీ | ‖ రీగా | మానీనీసాం | ‖ |
| తా. . | [illegible] . క మ ని | ‖ శ్రీ. | స న క తి | ‖ (రా) |

అవతారిక :— ఈకీర్తనయందు దయ్యగాను తాము అమితకష్టములఁబడి బహుప్రయత్నములు సల్పి పొందిన రాముఁడు తమ్మువిడచి కదలఁగూడదని వేడుకొనుచున్నారు.

(6) రీతిగౌళ - చాపు.

ప. నన్ను విడచి కదలకురా - రామా (న)

అ. నిన్ను †విడచి యుంట - సిమిషమౌర్వనురా (న)

చ. తరముగాని యెండవేఁగిల్ల - తిరుసి ‡సున్నట్లాయె నీవేళ (న)

2. అబ్ధిలో మునిఁగి శ్వాసము నబట్టి - యాణిముత్యము గన్నట్లాయె (న)

3. వసుధను ఖననముచేసి §వచ్చు - పసిఁడియబ్బిన రీతిఁ గనుఁగొంటి డాసి (న)

4. కాగుగ నన్నేలు ¶కొమ్ము వర - త్యాగరాజనుత ఈ తనువు నీసొమ్ము (న)

---

† 'బాసి' అనియొక పాఠము. ‡ 'తరుసీడ దొరికినట్లాయె' అనియొక పాఠము.

§ 'ధనభాండమబ్బినరీతి' అను పాఠము గ్రాహ్యము. ¶ 'కూడి' అను పాఠము గ్రాహ్యము.

## ప్రతిపదార్థము.

నన్నుఁ - నన్ను
విడచి - విడచి
కదలకురా - కదలకుము
నిన్నుఁ - నిన్ను
విడచి - విడచి
అఱ నిమిషము - అఱనిమిషమైనను
ఓర్వనురా - ఓర్వఁజాలను
తరముగాని - సహ్యముగాని
ఎండవేళఁ - ఎండవేళయందు
కల్పతరువు నీడఁ - కల్పవృక్ష చ్ఛాయయందు
ఉన్నట్లాయెఁ - ఉండినట్లాయె
ఈవేళఁ - ఈసమయమందు
అబ్ధిలోఁ - సముద్రమున
మునిఁగి - మునిఁగి
శ్వాసమునుఁబట్టి - ఊపిరి బిగియఁబట్టి
ఆణిముత్యము - మంచిముత్యమును
కన్నట్లాయెఁ - చూచినట్లాయెను
శ్రీరమణ - లక్ష్మీవల్లభుఁడా
వసుధను - భూమిని
ఖననము చేసి - త్రవ్వి
పచ్చి పసిఁడి - పచ్చని యపరంజి
అందినరీతిఁ - పొందినట్లుగా
డాసి - సమీపించి
కనుగొంటిఁ - చూచితిని
వడలు - తాపము
తగిలియున్న వేళఁ - తగిలియున్న సమయమున.

గొప్పవడగండ్లు - పెద్ద వడగండ్లు
దరిసినట్లాయెగా - దరిసినవిధమాయెను
ఈ వేళగా - ఈ సమయమున
బాగుగాగా - బాగుగా
నన్నుగా - నన్ను

ఏలుకొనుము - ఏలుకొనుము
వరత్యాగరాజనుత - శ్రేష్ఠుడైన త్యాగయ్యగారిచే స్తుతింపబడినవాడా
ఈ తనువు - ఈ శరీరము
నీసొమ్ము - నీ సొంతమైనది

విశేషార్థము:—'నన్ను విడదికదలకు, నిను బాసి అరనిమిష మోర్వనురా' అనుటచే, లక్ష్మణస్వామి రామునిగురించి, 'నచసీతాత్వయాహీనా నచాహమపి రాఘవ। ముహూర్తమపి జీవావో జలాన్మత్స్యావివోద్ధృతౌ'॥ అనగా, శ్రీరామా! నిన్ను బాసి సీతాదేవిగాని నేనుగాని జీవించియుండ లేము. అట్లు జీవించియుండినను జలములోనుండి వెలికిదీసి వేయబడిన మత్స్యమువలెనొక ముహూర్తము మాత్రమే ప్రాణము గొనుండగలుగుదుము, అని చెప్పినటులు అయ్యగారును విశ్లేషమును సహింపజాలక, శ్రీరామా! నన్ను వదలిపెట్టిపోకుము అనుచున్నారు.

తరముగాని యెండవేళ........నున్నట్లాయె' అనుటచే ద్రాపటను నీడకూడను గనడక [illegible] లిలేని ఎండయందు దపించువానికి కోరినవన్నియు నిచ్చు కల్పతరు చ్ఛాయ దిక్కిన నెట్లుం

నో అట్టే ఈసంసారతాపములచే దహించుచున్న నాకు 'వాసుదేవతరుచ్ఛాయా నాతిశీతానఘర్మ
గా' అనఁగా శీతోష్ణములచే గలుగు బాధలు తగులకయుండు స్థానమైన వాసుదేవతరుచ్ఛాయ
దక్కినదని తెలుపుచున్నారు.

'అబ్ధిలో మునిఁగి......ముత్యము గన్నట్లాయె' అనుటచే, శాపతప్తుఁడైన కబంధునకు శ్రీరామ
గ్రహణమువలన శాపవిమోచనము కావలసియుండినందువలన 'అవశ్యం గ్రహణం రామో మన్యే
హంసముపైష్యతి। యద్యత్పశ్యామి సర్వస్య గ్రహణం సాధు రోచయే॥' అనునటులు శ్రీరాముఁడు
తనచేత చిక్కు నంతవఱకు దిక్కిన సర్వజంతువులను భక్షించుచువచ్చి శ్రీరాముఁడు చిక్కినంతనే
శాపమునుండి విముక్తుఁడైనటులు సంసారసాగరమునందు మునిఁగి దరిగానకుండిన నాకు తారకరూపుఁ
డవగు నీవు ఆణిముత్యమువలెఁ జిక్కితివి. ఇఁకను నిన్ను విడనాడఁజాల ననుచున్నారని భావము.

'వసుధను ఖననము చేసి. ...పసిడి యబ్బినరీతి' అనుటచే 'షష్టిర్వర్ష సహస్రాణి మమజా
తస్య కౌశిక। దుఃఖేనోత్పాదితస్త్వాయం న రామం నేతుమర్హసి॥' అనఁగా దశరథుఁడు శ్రీరాముని
... ... ... ...సేనుఁడా! అఱువదివేల సంవత్సరములు దుఃఖసాగరమున మునిఁగి

యుండిన నన్ను లేవఁగిసిన [illegible] నాప్రియమైన రాముని, నీవు తీసికొని పోఁగూడదు అని విశ్లేషము నోర్వఁజాలక చెప్పినట్లును, అయ్యగారును తాము చాలకష్టపడి సంపాదించిన రామునితో, తమ్ము విడనాడ[illegible]వలదని తెలుపుచున్నారు.

'వక్షలఁగలిగి.........గురిసినట్లాయె' అనుటచే 'ఏష బ్రహ్మప్రవిష్టోస్మి గ్రీష్మే శీతమివ హ్రదం' అని సంస్కృతి తప్పుఁగను సుఖదమైనది ఈ బ్రహ్మప్రసాదస్నానమనుటను వెల్లడిపఱుచుచున్నారు.

'ఈతనువు నీసొమ్ము' అనుటచే సమర్పణార్థమును సూచింపించి శరణాగతిచేసి, శ్రీరామ ! నేను నీవాఁడను; నన్ను విడనాడకుండుట నీకు లాభము; నీ ఇష్టానుసారముగ చేసికొనుము; అని అత్యంత పారతంత్ర్యమును వెల్లడించిరి.

ప. ; * గగు | పా మా || గ రీ | మగపు || గ రీ | సా ; || ; ; | గా మా ||
; * న . | న్నువి || డచి | క . ద . || ల కు | రా ; || ; ; | ర మా ||

; * నిధ | మా గా || ,, | ,, || ,, | ,, || ,, | ,, ||
; * న . | న్నువి || ,, | ,, || ,, | ,, || ,, | ,, ||

అవతారిక :— ఈ కీర్తనమునం దయ్యగారు శ్రీరామా ! 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే'' అనునటులు ఒక్కొక యుగమునందును దుష్టనిగ్రహ శిష్ట పరిపాలనార్థ మవతరించి ధర్మసంస్థాపనము చేయువాఁడని చెప్పెదరు. నీ యొక్క నడకలను గమనించినపుడు నీవు కడు టక్కరివి యనియే తెలియుచున్నది. అని కొన్ని యుపమానములను నిచ్చి, వ్యాజనింద చేయుచున్నారు.

(7) రీతిగౌళ - చాపు.

ప. సీతానాయక శ్రితజనపోషక - శ్రీరఘుకులతిలక ఓరామ (సీ

అ. నిజముపేద భక్తుల కరకోఁత పడలేక - గిరిపై నెక్కి కొంటివో (శ్రీవెంకట గిరిపై) (సీ

చ. అంగలార్పుఁ జూచి రంగపురమునఁ జెలంగఁ బండితివో (రంగపురమునఁ జెలంగుచు) (

2. కాచినభక్తులఁజూచి యాఁబలిని - యాచింప వెడలితివో (యాఁబలిని యాచింప) (సీ

3. అశ్వమించి నన్నాశ్రయించెదరని - కోతులఁ జేరితివో (చేరెదరని కోతులఁ జేరితివో) (సీ

4. జాలితో వచ్చు కుచేలుని గని గోపీ - చేలము లెత్తితివో కను గోపీ చేలము) , (సీ

5. ఇంగిత మెఱిఁగి యుప్పొంగుచుఁ బ్రోచు - బంగారు దొరవైతివో (నన్నుఁబ్రోచు) (శ్రీ)
6. నీగుణముల గుట్టు బాగుగ దెలిసెను - త్యాగరాజవినుత (దెలిసెనయ్య) (శ్రీ)

ప్రతిపదార్థము.

శ్రీరామా - శ్రీరామా
నిఱుపేద భక్తుల - చాల దీనులైన భక్తులయొక్క
కరికోతఁజ - ఉపద్రవమును
వశలేక - ఓర్వఁజాలక
వేంకట గిరిపైఁజ - వేంకటాద్రిపైని
ఎక్కుకొంటివి ఓ - ఎక్కుకొంటివో
అంగలార్పుఁజ - భక్తులయొక్క మొఱలను
చూచి - కని
రంగపురమునఁజ - శ్రీరంగ పురమునందు
చెలంగఁగఁజ - బాగుగ
ఘండిలివో - పరుండితివో

కాచిన భక్తులఁజ - నిన్నుఁ గాచి యున్న భక్తులను
చూచి - కని
ఆ బలిని - ఆ బలిచక్రవర్తిని
యాచింపఁజ - యాచించుటకు
వెడలితివో - బయలుదేఱితివో
ఆశించి - భక్తుని మిక్కిలి ఆసగలవాఁడవై
నిన్నుఁజ - నిన్ను
ఆశ్రయించెదరని - పొందుదురని
కీశులఁజ - కోఁతులను
చేరితివో - కూడితివో
జాలితోఁజ - వ్యసనముతో

వచ్చు - వచ్చుచున్న
కుచేలునిఁ - కుచేలుని
కని - చూచి
గోపి చేలములు - గోపికల వలువలను
ఎత్తితివో - దొంగిలించితివి
ఇంగితము - ఇంగితము
ఎఱిఁగి - తెలిసి
ఉప్పొంగుచు - సంతోషించుచు

ప్రోచు - కాపాడునట్టి
బంగారువాగవు - మంచి ప్రభువవు
ఐతివో - అయితివో
త్యాగరాజనుత - త్యాగరాజుచే నుతింపఁబడిన శ్రీ రామా
నీ గుణముల కట్టు - నీ గుణముల యొక్క రహస్యము
బాగుగ - చక్కఁగ
గాలిసెను - తెలియవచ్చెను

విశేషార్థము :—ఇందు అయ్యగారు భగవంతుని యొక్క చర్యలయందుఁ గొన్నిటి నుదాహరించి వానిచే భగవంతు నిట మోసగాఁడని వ్యాజనింద చేయుచున్నారు. (నిజము పేక... నెక్కకొంటివో) అనుటచే శ్రీరామా! నీవు నీదు నగరమునందు రాజుగ వెలసిన మొదల నాబోంటి దీనులు నీయొద్దఁ జేరి మాటిమాటికిని కాపాడుమని తొందర పెట్టెదు రని గదా నీవు మఱియొక అవతారమున వేంకట గిరిపై నెక్కకొంటివి. అటువంటి ఉన్నతమైన పర్వతము నెక్కి నాబోంటి దీనులు రాఁజాలగలిగిగా ఐటి కారణ మెవరికి తెలిసిని అనుచున్నారు

'అంగలార్పఁ జూచి . . . పండితివా' అనుటచే శ్రీరామా! దీనులైన నీదాసులు మొఱఁబెట్టి అంగలార్చునపుడు ఆ మొఱలకు నెంతమాత్రము చెవియీయకయుండుటకై గదా నీవు ఉభయ కావేరీమధ్యనుండు శ్రీరంగక్షేత్రమునందు పరుండి నిద్రచేయుచున్నావని తెలుపుచున్నారు.

'కాచిన . . . యాచింప వెడలితివో' అనుటచే శ్రీరామా! నీవు మహాదాతవని నిన్ను యాచించుటకు యాచకులు వచ్చుచున్నారని నీవే యొక యాచకునివలె వేషము వేసికొని మహాబలిని యాచించి వాని సామ్రాజ్యముఁ జేకొంటివి. ఈ కార్యము వలన నీ వెవరికిని నేమియు నియ్యకుండ యుండినది మాత్రమేగాక ఇచ్చునట్టి దాతగనుండిన బలి చక్రవర్తిని ఈలోకమునందే యుండనీయకుండఁ జేసితివి. ఇదియా నీ పరమ దాతృత్వము! అనుచున్నారు.

'ఆశవించి . . . చేరితివా' అనుటచే శ్రీరామా! 'పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' అని పురుషులుగూడ మోహించునట్టి రూపమును తదనుగుణమైన సుగుణములు గలవాఁడవని మిక్కిలి యాసగొని నీయొద్దఁ జేరినవారలను జూచినవెంటనే నీవు అయోధ్యను విడనాడి అడవిఁ జేరి కోఁతులతో స్నేహము చేసికొంటివి. అదిమాత్రమే కాదు, (పురాయస్సపి కామ్యాసీ చ్చరణో్వ ధర్మవ

త్సలః । తస్య పుత్రో మహానాసీత్ సుగ్రీవం శరణం గతః) అనునట్లు నీ పితృ గౌరవమును గూడ గమనింపక కేవలము ఒక కోతిని శరణు చొచ్చితివి. ఇట్టి కోతితో సహవాసము చేయు నీవా మనుష్యులను రక్షించువాఁడవు!

జాలితో... ఎత్తితివో' అనుటచే శ్రీరామా! 'కలలోనైనను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడైనట్టి దుర్బలుఁడా పత్సమయంబునఁ గిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ దలపన్నంతన మెచ్చి ఆర్తిహరుఁడై లెనై ననిచ్చుఁ' అని చెప్పిన ద్రుపదాత్మజ యను భార్యయొక్క మాటవిని నీయొద్ద యాచనార్థముగ వచ్చిన కుచేలునికి, 'కుచేలా! నీయొద్ద నొక గంతల వస్త్రమైననున్నది. నాయొద్ద అదియును లేకగదా ఆఁడువారల చేలములను దొంగిలించితిని. నాయొద్దకు యాచించుటకు వచ్చిన నీకేమి ఇయ్యఁగలుగుదును' అని తెలుపుటకై గదా నీవు గోపికలవస్త్రములను దొంగిలించితివి. స్త్రీల వస్త్రముల దొంగిలించునట్టి యోగ్యుని యాచించిన నేమి చిక్కును? అనుచున్నారు.

'ఇంగితమెఱుఁగని, నీ గుణములగట్టు' ఈ చరణములచే, శ్రీరామా! ఇదిమాత్రమే కాదు. ఇంకను నీయొక్క విషయములను గమనించునప్పుడు నీవు యుక్తాయుక్త జ్ఞానముతో నెవరిని ఇంగిత

మెఱింగి కాచినటులు తెలియలేదు. నీదు అవతార ప్రయుక్తమగు గుణములయొక్క గుట్టు ఇక్కడను కదా తేటతెల్లమగుచున్నదని వ్యాజనిందచేయుచున్నారు.

ప. , * గమ | పామా || గగరి | సనిసా || , నిస | గగరీ || గా గా | మామా ||
, * సీ. | తా. || నా. . | య. క || , శ్రిత | జ. న || పో. | ష. క ||

* గమ | నిధమా || ,, | ,, || ,, | ,, || ,, | ,, ||
* సీ. , | తా. . || ,, | ,, || ,, | ,, || ,, | ,, ||

,, | ,, || ,, | ,, || , నిస | గాగా || మా , | నిధనిస ||
,, | ,, || ,, | ,, || , శ్రిత | జన || పో , | ష.క. ||

, * నిప | నిధమా || గమపామా | గరిపా || , నిప | గాగా || మా , | పనిధని ||
, * సీ. | తా. . || నా. . . | య. క || , శ్రి | జన || పో , | ష క. ||

స * ధని | సాని || ధమా | గమగరి || సా , | ; నిస || గగమ | నినిసా ||
* శ్రీ. | రఘు || కుల | తి . ల. || క , | ; ఓ. || రా. . | మ. ||

, గరి | సానీ || ధమా | గమపమగారి || సా , |
, శ్రీ. | రఘు || వం | శ... ల. || క గ్రీ | ఇవట నిలుపవలెను.

(ఇతర చరణములు నిటులే పాడుకొనవలయును).

అవతారిక :— ఈ కీర్తనమునం దయ్యగారు శ్రీ రామా! నీవు ఈ రామావతారమునందు మిక్కిలి శ్రమపడి బడలియున్నావు. ఆ బడలిక తీరునట్లుగా నాహృదయమునందు వసించి నాయు పాపరాసులను బోగొట్టుమని ప్రార్థించుచున్నారు.

(8) రీతిగౌళ - ఆది.

ప. బడలిక దీఱ బవ్వళింపవే

అ. సడలని దురితములను దెగఁగోసి - సార్వభౌమ సాకేత రామ

చ. వంకటాసనుని పరితాపము గని - పంకజాప్తుల పతివై వెలసి
పంకజాక్షితో వనమున కేఁగి - జింకను వధియించి

మంకు రావణుని మదము నణంచి ని - శ్శంకుడగు విభీషణునికి బంగరు
లంక నొసంగి సురలం బ్రోచిన నిష్క - ళంక త్యాగరాజుని హృదయమున (బడ)

ప్రతిపదార్థము,

సార్వభౌమా-సమస్తభూమండలమునకును రాజైనవాడా
సాకేతరామా - అయోధ్యాపురము నేలు రాముడా
పంకజాసనుని - బ్రహ్మదేవునియొక్క
పరితాపముగని - పరితాపమును చూచి
పంకజాప్తకులపతియై - సూర్యవంశోద్ధారుడై
వెలసి - అవతరించి
పంకజాక్షితోగూడ - కమలమువంటి కన్నులుగల జానకితో
వనమునకేగి - అరణ్యమునకుజని
జింకనువధించి - జింకరూపముతోవచ్చిన మారీచునిజంపి
మంకురావణుని మదముగా - దుర్మార్గుడగు రావణుని మదమును.

అణంచి - అణగద్రొక్కి
నిశ్శంకుడగు విభీషణునికిగా - శంకలేని విభీషణునికి
బంగరు లంకను - స్వర్ణమయమైన లంకాపట్టణమును
ఒసంగి - పట్టము గట్టి
సురలను - దేవతలను
బ్రోచిన - కాపాడిన
నిష్కళంక - కళంకము లేనివాడా
త్యాగరాజుని హృదయమునగా - త్యాగరాజునిహృదయమునందు
(బడలికదీర బల్కరింపవే)

విశేషార్థము :—శ్రీరామా ! బ్రహ్మాదేవుని యొక్కయు దేవేంద్రుని యొక్కయు ప్రార్థనాను సారముగ క్షీరాబ్ధియందు యోగనిద్రనుండి లేచి భూమియందు సామాన్యుఁడవు నొక దశరథ చక్రవర్తికి కొడుకుగఁ బుట్టి భూపుత్త్రియగు సీతను పెండ్లాడి సమస్త భోగములకు నాటపట్టైన అయోధ్యను వదలి అరణ్యమునకుంజని ‘ తదవశ్యం మయా కార్యం ఋషీణాం పరిపాలనమ్ ’ అను నటులు అచ్చటి ఋషుల పరిపాలననే నీ స్వంత కార్యముగ భావించి, ఆ కార్యమును కొనసాగించుటకై అనేక కష్టములకు నోర్చియుండి మారీచుని వధించి, సీతాపహరణమును సహించి, రావణాదులను వధించి, విభీషణునికి లంకారాజ్యము నొసంగి, ఋషుల యొక్కయు, దేవతల యొక్కయు కష్టములనుదీర్చి బ్రోచితివి. ఇఁకను నీ దాసుఁడగు త్యాగరాజును కరుణించి వాని మనస్సునందలి పాపరాసులను బోఁగొట్టి అందు పవ్వళించి ఈ నీయవతారమునందుఁ గలిగిన బడలికఁ దీర్చుకొనుము అని యొక భావము.

శ్రీరామా ! ఈ రామావతారమెత్తినది మొదలుకొని మితిలేని కష్టముల ననుభవించియు అనేక యుద్ధములను జేసియు బడలియున్నావు. ఈ బడలిక దీఱవలయునేని నా మనస్సనెడి శయ్య

పైని పరుండవలయును. శయ్యను బాగుగ నుంచుకొనవలసిన భారము అంతయు పరుండువానిదిగదా! కనుకనే నామనస్సనంపలి పాపములను పోగొట్టు భారము నీదిగనే యున్నది. అట్లు నీవు చేయక పోయినచో కష్టపడువాడవు నీవే యని మతియొక భావము.

; * పమాగరీ - గమగరి - గగా , | సా - నీనీసా | గా ; , గసా ||
; * ఒడ లిక - దీ . . . - ర . , | . - ప . వ్వ | ళిం ; , పవే ||
; * ధపపమా , - రీగ - గమగరి - గాగా | ,, | . . ,, ||
; * బ. డ . . - లిక - దీ . . . - ర . | ,, | ,, ||
; * నిధమా , - గ రీ - గా ; - గమపమగారీ | ,, | ,, ||
; * బ. డ ; - లిక - దీ ; - ర . . . . . | ,, | ,, ||
; * నిధమా ; - గ రీ - సీసా - గమపమగరీ | ,, | గ మా , - నిసని ; ||
; * బ. డ ; - లిక - దీ . - ర . . . . . | ,, | ళిం . , - పవే. ; |
; * నిధా - మగా - గమపమగారీ - గగా, | ,, | ,, |
; * బడ - లిక - దీ . . . . . . - ర . , | ,, | ,, |

; * గామానీ ; నిధనీ ; | ; - ధనీస నీ | సా ; ; సా ||
; * పంకజా ; క్షీ.తో ; | ; - వనముచ | కే ; ; గి ||

; * సనిధమా - గారీ - గమపమగారీ | గగాపా ; , | ; ; ; ; ||
; * జింకను - వధి - యిం. . . . | చి. . ; , | ; ; ; ; ||

; * నినీధమా ; గారీగా | ; మనీధమా | గమపమగారీ - గాసా ||
; * మంథరా ; వణుచి | ; మదముచ | ణ . . . చి . - ని ||

; * స్నీస్నీస్సా - గాగామామా - | ; మనీ ధమా | నీ ; - నిసనీ ||
; * శ్యంకు - డ గుని భీ - | ; మణునికి | బం, - గ.ను. ||

; * సనీధమా - గమ్మనీ , ధ నీ | ; ధనిసా , ని | సానీ - సాసా ||
; * లంకనా - స.గి , సుర | ; లక్ష్మభ్రో, . | చిన - నిమ్మ ||

; * గమగరిసా - ని సనిధనీ , -సా | ; - నిధా,మమ | పపధప - పమ్మగరి ||
; * శం . . క్ష - త్యా. . . గ - రా | ; - జునిహృ్క | యు. . . - యు న. ||

గమ * నిధమా ; గరీ |
. . * బం.డ ; లిక .|

అవతారిక :— ఈ కీర్తనమునం దయ్యగారు, తాము భక్తుల సమూహమునకు ప్రతినిధిగ నుండి, శ్రీరామా! నీవు మాకందఱకును దగ్గఱవచ్చి సేవ నొసంగవలయునని ప్రార్థించుచున్నారు.

(9) ఆనందభైరవి - ఆది.

ప. రామరామ నీవారము గామా రారా సీతా - రామరామ సాధుజనప్రేమా రారా (రా)

చ. మెఱుఁగుచేలము గట్టుకొని మెల్ల రారా రామ - కఱకుబంగారుసొమ్ములు కదల రారా (రా)

2. వరమైనట్టి భక్తాభీష్ట వరద రారా - మఱుఁగు చేసికొన్న దివ్య మహిమా రారా (రా)

3. మెండైన కోదండ కాంతి మెఱయఁగ రారా యినుల - పండువగ నుండు నుద్దండ రారా (రా)

4. చిఱునవ్వుగల మోము చూప రారా - కరుణతో నన్నెల్లప్పుడుఁ గావ రారా (రా)

5. కందర్పసుందర ఆనందకంద రారా నీకు - వందనము చేసెద గోవింద రారా (రా)

6. ఆద్యంతరహిత వేద వేద్యా రారా భవ - వైద్య నే నీవాఁడనైతి వేగ రారా (రా)

7. సుప్రసన్న సత్యరూప సుగుణ రారా రామ - అప్రమేయ త్యాగరాజు నేల రారా (రా)

## ప్రతిపదార్థము.

రామరఘు – శ్రీరామా
నీవారము కామా – మేము నీవారము కామా
రామరామా – శ్రీరామా
సాధుజనప్రేమ – సాధుజనులయందు ప్రేమగలవాఁడా
రారా – రారా
మెఱుఁగు చేలముగా – వన్నె చేలమును
కట్టుకొని – కట్టుకొని
మెల్లఁగా రారా – తిన్నఁగా రారా
కఱకుబంగారుసొమ్ములు – మేలైన బంగారు భూషణములు
కదలరారా – కదలునట్టుగ రారా
పదమెత్తి భక్తాభీష్టవరద – శ్లాఘ్యులైన భక్తులయొక్క

రారా – రారా
పలుమారుచేసికొన్న – మఱలు ఘటించుకొన్న
దివ్యమహిమ – దివ్య మహిమ గలవాఁడా
రారా – రారా
మెండైన – గొప్పదియైన
కోదండకాంతి – కోదండముయొక్క కాంతి
మెఱయఁగా – ప్రకాశించునట్లుగ
రారా – రారా
కనులపండువగనుండు – కంటికి నానందముగ నుండు
ఉద్దండ – గొప్పవాఁడా
రారా – రారా
చిఱునవ్వుగల – మందస్మితము గల
మోముగా – ముఖమును

చూడగ రారా - చూచుటకు రారా
కరుణతోడ - కృపతో
నన్నుగ - నన్ను
ఎల్లప్పుడును - అన్ని సమయములయందును
కావగ రారా - కాపాడుటకు రారా
కందర్పసుందరా - మన్మథునివంటి అందము గలవాడా
ఆనందకంద - ఆనందపు మొలకా
రారా - రారా
నీవుగ - నీవు
వందనము చేసెదగ - వందనమొనరించెదను
గోవింద - గోవులను పాలించువాడా
రారా - రారా
ఆద్యంతరహిత - తుదమొదలు లేనివాడా
వేదవేద్య - వేదములచే తెలియదగినవాడా

రారా - రారా
భవవైద్య - భవరోగములను పోగొట్టువాడా
నేడా - నేను
నీవాడనై ఉంటిగ - నీ సేవావాడనై ఉంటిని
వేగ రారా - శీఘ్రముగ రారా
సుప్రసన్న - మంచి ప్రసన్నదనము గలవాడా
సత్యరూపా - సత్యస్వరూపుడా
సుగుణ - సుగుణములు గలవాడా
రారా - రారా
అప్రమేయా - ఎన్నుటకు సాధ్యము లేనివా
త్యాగరాజుగ - త్యాగరాజును
ఏలగ - కాపాడుటకు
రారా - రారా

విశేషార్థము :—'రామరామ ! నీవారము కామా' అనుటచే, శ్రీరామ ! 'బహువిఘ్నం తపోనిత్యం దుశ్చరం చైవ రాఘవ ! తేన శాపం న ముంచామో భక్ష్యమాణాశ్చ రాక్షసైః ॥ తద ర్ద్యమానో రక్షోభి ర్దండకారణ్యవాసిభిః । రక్ష నస్త్వం సహ భ్రాత్రా త్వన్నాథాహి వయం వనే॥' తపస్సు బహు విఘ్నములతోఁ గూడుకొనియుండునది. రాక్షసులు మమ్ము భక్షించినను వారిని మేము శపింపము. 'శపించినచో తపోవిఘ్నము కలుగును' ఈ దండకారణ్యములో రాక్షసులచే పీడింపఁబడియుండు మమ్ము తమ్మునితోఁ గూడి నీవు రక్షింపవలయును. మాకు నీవే నాథుండవు. అని చెప్పిన ఋషులను గాపాడుటకై 'తదవశ్యం మయా కార్యం ఋషీణాం పరిపాలనం' అనునటులు ప్రతిజ్ఞచేసి రక్షించుటకుఁ బూనుకొన్నావు కదా. మేముమాత్ర మట్టివారము కామా ? మమ్మును కాపాడుమనుచున్నారు.

'మెఱుఁగు...కదలరాదా,' అనుటచే శ్రీరామా ! నీవు సర్వాభరణముల నలంకరించుకొని, మంచి బంగారు వస్త్రము ధరించి మాయొద్దకు వత్తువేని 'గజసింహ గతీవీరౌ శార్దూల వృషభోపమౌ' అనునట్లు గజము, సింహము, శార్దూలము, వృషభము వీనియొక్క గతులవలె గంభీరముగ నుండు నీనడలను చూచి యానందింతుము అని భావము.

'మెండైన కోదండకాంతి...ఉద్దండ రారా' అనుటచే శ్రీరామా! 'తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్ । బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే ॥' అనునట్లు నీవు ఒక్కడుగనే ఖరదూషణాదులను వధించి ఆ యుద్ధమునందుఁ గలిగిన చిహ్నములతోడనే సీతాదేవి యెదుట నిలచినప్పుడు ఆమె నీ యమితపరాక్రమమును జూచి భ్రమించి యేమియుఁ జెప్పఁజాలక నిన్నాలింగనము చేసికొన్నట్లు, కోదండపాణివై యుద్ధమునకుఁ బోవుచున్న నిన్ను కన్నుల కింపుగఁ జూచి యాలింగనము చేసికొనవలయును; చెంతకు రారా; అని అయ్యగారు ప్రార్థించుచున్నారని భావము.

'చిఱునవ్వు...జూప రారా' అనుటచే 'సుస్మితం' అనునట్లు మందహాసముతో సదా కూడుకొనియున్న నీదు ముఖారవిందమును జూపరారా అనుచున్నారు.

'కందర్ప...రారా' అనుటచే 'సాక్షాన్మన్మథ మన్మథః' అనునట్లు కోటిమన్మథులకు సమానమైన లావణ్యము గల నీ దివ్యమంగళ విగ్రహసేవ నొసఁగు మనుచున్నారు.

'ఆద్యంతరహిత, భవవైరాగ్య, అప్రమేయ, సుప్రసన్న,' అను విశేషణములచే, శ్రీరామా! నీవు నిత్యుడవు, సంసారదుఃఖమును పోగొట్టువాడవు, ఎన్నరాని మహిమలుగలవాడవు అని నిన్నాశ్రయించితిని నన్ను కటాక్షించవలయునని భావము.

ఆనదభైరవి రాగలక్షణము :—ఇది 20 వ మేళమైన నటభైరవియందుజన్యము. షాడవ వక్ర సంపూర్ణ రాగము. ఆరోహణమునందు ఋషభ దైవతములు వర్జ్యము. అవరోహణము సంపూర్ణము సాధారణ గాంధార శుద్ధ మధ్యమ కైశికి నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఈ రాగమునందు విశేషముగా చతుశ్శ్రుతి దైవతమే పలుకుచున్నది. 'పదప' అను తావునందుమాత్రము నియతముగ శుద్ధ దైవతము పలుకును. తదితర స్థానములయందు సమయోచితముగ శుద్ధ దైవతమును చతుశ్శ్రుతి దైవతమును పలుకును. ఈరాగమున కాకలీ నిషాద ప్రయోగమును గలదు. ఈ ప్రయోగము కూడదని కొందఱిమతము. ఎల్లప్పుడును గానము సేయదగినది.

## (10) ఆనందభైరవి - ఆది.

ప. నీకే తెలియకపోయిన - నే నేమి సేయుదుర (నీ)

అ. లోకాధారమవయ్యు నా - లోనఁ బ్రజ్వలించెడు జాలి (నీ)

చ. ఎందెందుఁ జూచిన - నెందెందుఁ బలికిన
నెందెందు సేవించిన - నెందెందుఁ బూజించిన
నందందు నీవని తోఁచు - నందుకు నీ పాదార .
విందమును ధ్యానించిన - దెందుకని త్యాగరాజసన్నుత (నీ)

ప్రతిపదార్థము.

నీకు జో ఏ - సర్వజ్ఞుఁడవగు నీకే
తెలియక పోయినజో - తెలియనటు పోయినట్లయిన
నేజో - నేను
ఏమి సేయుదుజో రా - ఏమి చేయఁగలను రా.

లోకాధారుఁడవు - లోకములకు దిక్కైనవాఁడవు.
ఐయుజో - ఐనప్పటికిని
నాలోనజో ప్రజ్వలించెడి జా. నాలోపల మండుచున్న
దుఃఖము

త్యాగరాజనుత — త్యాగరాజుచే కొనియాడఁబడు శ్రీ రామా

ఎందుకా ఎందుకా — ఎక్కడెక్కడ

చూచినకా — చూచినప్పటికిని

ఎందుకా ఎందుకా — ఎక్కడెక్కడ

పలికినకా — మాటలాడినను

ఎందుకా ఎందుకా — ఎక్కడెక్కడ

సేవించినకా — చూచినను

ఎందుకా ఎందుకా — ఎక్కడెక్కడ

పూజించినకా — ఆరాధించినను

అందుకా అందుకా — అక్కడక్కడ

నీవు అని — నీవు నిండియున్నావని

తోఁచుననుటకా — తోఁచుటకు

నీ పాదారవిందము — తామరపుష్పమువంటి నీ పాదములు

ధ్యానించినది — నే ధ్యానము చేసినది

ఎందుకని — ఈ త్యాగరాజు ధ్యానము చేసినది ఎందుకని

(నీకే తెలియును)

విశేషార్థము.—రామా! 'ఇంగితజ్ఞాశ్చ కోసలాః' అనుపట్టుల నీచే పరిపాలింపఁబడు కోసల దేశమునందలి మనుజులే పరుల యభిప్రాయమును కనిపెట్టువారని ప్రసిద్ధియైయుండఁగా నీవేల నా యభిప్రాయమును కనిపెట్టకున్నావు? నేను నీ పాదారవిందముల సదా ధ్యానించుచుం డుట యెందుకో తెలియునా! 'జ్యోతింషి విష్ణుర్భువనాని విష్ణుర్వనాని విష్ణుర్గిరయో దిశశ్చ'

అనుచటులు తేజః పదార్థములు, లోకములు, పర్వతములు. వనములు, దిక్కులు సర్వము నీవని యున్నదిగాన నేదలంచినప్పుడు, పిలిచినప్పుడు నాకు నీదర్శన మగుచుండవలయును. 'ప్రయోజన మనుద్దిశ్యనమందోపి ప్రవర్తతే' యనునటులు ఒక లాభము నుద్దేశింపక వెఱ్ఱివాఁడుగూడ నొక పనినిగూర్చి ప్రయత్నింపఁబడు. సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందును నీ దివ్యమంగళవిగ్రహమును సేవించుటయే నాకు లాభము. అది లభింపకయే యిట్లు వెతలుచెందుచున్నాను.

భావజ్ఞుఁడవగు నీకు నా మనోదుఃఖమును దీర్పుమనుటకన్న నెక్కువ చెప్పవలసిన దేమున్నది ? లోకాధారుఁడవు అని పిలిపించుకొనిన నీ పెద్ద పేరునకును నన్నుఁ జూచిన చిన్నచూపునకును సంబంధము గలదా ? అని అయ్యగారు నిష్ఠురమునాడుచున్నారని భావము.

| | | | |
|---|---|---|---|
| ప. | ; * పాసా , నీధా పా,మా | ; - పమగారీ | గా రూసా ; ‖ |
| | ; * నీ కే ;. తెలి యక | ; - పో. .యి | వ . . . ; ‖ |
| 2 | ; * మపనిసరిస - నీధాపామా | ,, | ,, ‖ |
| | ; * నీ . కే . . . - తెలియక | ,, | ,, ‖ |

అవతారిక: ఇంక అయ్యగారు శ్రీరాముని నవ్వుముఖమును సేవించకపోతినే యని చింతించుచున్నారు.

## (11) ఆభేరి - ఆది.

ప. నగుమోము గనలేని-నాజాలిఁ దెలిసి-నన్ను బ్రోవఁగరాదా శ్రీరఘువర నీ (న)

అ. నగరాజధర నీదు పరివార-మెల్ల నొగి బోధనచేసెడు వారలు గారే అటులుండుదురే నీ (న)

చ. ఖగరాజు నీయానతి విని వేగ చనలేఁడో-గగనంబునకిలకు బహు దూరంబనినాఁడో
జగమేలెడు పరమాత్మ ఎవరితో మొఱలిడుదు-వగచూపకు తాళను నన్నేలుకోర త్యాగరాజనుత నీ (న)

### ప్రతిపదార్థము.

శ్రీరఘువర - శ్రీరామచంద్రా
నీ నగుమోము - నీ నవ్వుముఖమును
కనలేని నాజాలి - సేవించకపోతినే యని చింతిలునాదు; ఖమును
తెలిసి - ఎఱింగి
నను - నన్ను
బ్రోవఁ, కఁ రాదా - కటాక్షింపరాదా
నగరాజధర - గోవర్ధనగిరినెత్తినవాఁడా

విశేషార్థము :— రామా! నాకు వారల పీరలవలె రాక్షసుల భాధపోవలయుననిగాని, రాజ్యము రాలేదనిగాని, పూజ్యతగలుగలేదనిగాని చింతలులేవు, నీవవ్వాముఖమును సేవింపకపోతినే యనుచింతయే యొక పెద్దచింత. మహావీరుఁడవై దేవతలచింత నెల్లఁబాపిననీకు ఈనా చిన్నచింతను బాపశక్తిలేదా? సర్వజ్ఞుఁడవగునీకు నాదుఃఖమిట్టిదని తెలియలేదా? ఉభయవిభూతినాథుఁడవై మహావైభవము లనుభవించుటచే నీకు నాపైని జ్ఞాపకము లేకున్నను, నీనిజనులైన ఒకపర్యాయము త్యాగయ్యగారికి దర్శనమిచ్చి రమ్మని పురుషకారము చేయకుందురా? లేక నీవేరాఁదలఁచినప్పుడు నీ వాహనమగు గరుత్మంతుఁడు నీయాజ్ఞ మీఱియుండెనా? 'అతన్త్రితచమూపతి ప్రహితహస్త మస్వీకృత ప్రణీతమణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్। అవాహనపరిష్కృతం పతగరాజమారోహతి, కరిప్రవరబృంహితే' అనునటులు గజేంద్రుని రక్షించుకాలమున పరమపదమున విష్వక్సేనులతోఁ జెప్పక, అన్తఃపురమునకుఁ దెలియపఱచక, అతివేగముతో వచ్చినపుడు జీను మొదలగు వాహనాలంకారములు లేక విడిశరీరముతోనే మిమ్ము వేంచేపించుకొనివచ్చిన గరుత్మంతుఁడిపుడు మీమాటమీఱునా? నిర్హేతుకకృపచే లోకమునంతయు నేలెడు జగత్కుటుంబివగు నీవే యిట్టి సాకులు చెప్పిన నే

నెవరితో చెప్పుకొందును? 'కించె తోచెను మేసిన' మరి కాపాసు వారెవరు? ఇట్టి పగలు చూపక నిరగు మొగమును జూపినన్నూ కాపాడుము; ఇంక నెవరు బాసియున్నారు. ఇది నే నన్నేలుకొనవలసిన సమయము సుమా' అయ్యగారు విజ్ఞాపించుచున్నారని భావము.

ఆభేరి రాగ లక్షణము :—ఔడవ సంపూర్ణము. 20 వ మేళం నఠభైరవి జన్యము. ఆరోహణమందు ఋషభ ధైవతములు వర్జ్యంబులు. సాధారణ గాంధార, శుద్ధమధ్యమ, కైశికీ నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడును గానము సేయదగినది.

ఆరోహణము. అవరోహణము.

స గ మ ప ని సి. సి ని ధ ప మ గ రి స.

ఈ రాగమును నఠభైరవి జన్యమని చెప్పుచున్నారు. నఠభైరవి రాగమునకు ముఖ్యాంశమైన శుద్ధ ధైవత ప్రయోగ మిందు గనబడదు. ఇప్పుడీ రాగమునందు చతుశ్రుతి ధైవతమే వాడబడుచున్నది. ఈ రాగమును 22 వ మేళమైన ఖరహరప్రియయందు జన్యమని చెప్పినచో మిగుల యుక్తమై యుండును. 'పదప' అను ప్రయోగమందు మాత్రము శుద్ధ

ధైవతము ప్రయోగింపఁబడుచున్నది. ఈ వివరము క్రింద వ్రాయఁబడియున్న త్యాగరాజ కీర్తనలోఁ జూచునది.

ప. 1. పప నీ ; - నీ ధపమా; - మా | గా; పగగరి - రీసా | సగరి - గరిగా ||

నగుమో; - ముగనలే ; - ని | నా;జా . . . - . లి | దెలి. - సి. . ||

2. పప నీ - మపనీనీ ; - ధపమా - పగమామా ; | ,, | ,, ||

నగుమో- . . .ము; - గన లే - . . . . ని ; | ,, | ,, ||

3. పప నీ - పనిసా సా ; - నిధసని - నిదధపమా; | ,, | సగా-సగమా-గమపా ||

నగుమో - . . . ము , - గనలే - . . . , ని ; | ,, | దెలిసి - . . - . . ||

4. పేను సనిసా సా , - సీధానీనిధ - ధపపపమా ; | గారిపగగరి - పమగరిసా; | ,, ||

నగుమో- . . . ము . . న లే. . . - . . . . ని ; | నా.జా. . . - . . . . లి ; | ,, ||

5. ,, - గరిసని - నిధపా; | ంచేపలుకొనివచ్చిన గయత్మంతుడిప్పుడు మామాటమా ||

,, - గనలే . - . . . . ని ; | ను జగత్కుటుంబివగు నీవేయిట్టి సాకులు చెప్పిన నే

6. ,, – గరి రిసస నినిధ – ధపప మగా ; | ,, | ,, ||
,, – గ . న . లే. . . – . . . . ని ; | ,, | ,, ||

7. మప నీ – పనిసా నిసగా – మగగరి రిసని – నిదధపమా,| ధపప మమగగరి–స గరిసా;| ,, ||
నగుమో– . . . ము. . – గ . న. లే. . . . – . . . . . ని ;| నా. . . జా. . . – . . . . లి ;| ,, ||

మప నీ – సానిధ – పా – మగగరి – సససపమగరి | సా ; ; మగ | రిస – సిసగరిగమ ||
నను బ్రో – . వ. – రా – . . . . . – . . . . . . . . | దా ; ; – శ్రీ. | రఘువ రనీ. . . ||

అ. 1. పనిసా; సా – సగమా ; మా | గరిగా ; రి | పమగరిసా ; ||
నగరా; జ – ధర నీ ; దు | ప రివా ; ర | మో. . ల్ల ; ||

2. పనిసా – పనిసా సా; – సగమా – సగమా మా ; | ,, | ,, ||
నగరా – . . . జ ; – ధర నీ – . . . . దు ; | ,, | ,, ||

3. పానిసరి సని–పనిసా సా;–సా గా మపమగ–సగమా మా; | ,, | ,, ||
న గరా. . . . . . . జ ;– ధ ర నీ. . . . . . . . దు ;| ,, | ,, ||

పనిసా ; సస - నిసాస్గా ; - గ రి | స గ మా ; - పమ | గామా-గమపా-పా ; ||
గగనం ; బున - కి ల ను ; - బహు | దూ . రం ; - జని | నా . - . . . -డో ; ||
పనిసా ; సని - సగమా ; మా | గరిగా ; రీ | పమగరిసా ; ||
జగమే ; లెడు - పరమా ; త్మా | ఏవ రీ ; లో | మొఱలిడుదు ; ||
పనిసా - పనిసాసాసా - సగమా - సగమామా ; | ,, | ,, ||
జగమే - . . . లె డు - పరమా - . . . త్మా ; | ,, | ,, ||
పానీపరిసని-పనిసాసాసా-సా గామపమగ-సగమామా; | ,, | ,, ||
జ గ మే . . . - . . . లె డు - ప ర మా . . . - . . . త్మా ; | ,, | ,, ||
,, | ,, | ప మగరి రీ ; ||
,, | ,, | మొఱలిడు దు ; ||
గరిరీ - రిసిసా - సనినీ - నిదధప - | నీపా ; - నిధ | పమాగ - రిగమా ||
వగమా - పకుతా - శనున - న్నా . లు - | కోరా ; - త్యా | గరాజ - నుత నీ ||



అవతారిక :— ఈ కీర్తనమునందయ్యగారు భగవంతుని అవయవము లన్నియు నాపాద మస్తకము పరమభోగ్యములనియు, వాని చక్కఁదనమునకు వాని చక్కఁదనమే సాటిగాక వేఱు లేదనియు తెలుపుచున్నారు.

(12) శుద్ధదేశి - ఆది.

ప. ఎందుఁ ‡ కౌఁగిలింతురా ని-న్నెంతని వర్ణింతురా ని (న్నెం)

అ. అందమైన కుందరదన- ఇందిరా హృన్మందిరా ని (న్నెం)

చ. నీదు పలుకే పలుకురా - నీదు కులుకే కులుకురా

నీదు తళుకే తళుకురా - నిజముగ త్యాగరాజనుత ని (న్నెం)

ప్రతిపదార్థము.

ఎందుకౌ కౌఁగిలింతుకౌరా - నీ యవయవములలో నే యవయవమందు గాఢాలింగన మొనర్తురా నిన్నుకౌ - నిన్ను

అందమైన కుందరదన యిందిరా హృన్మందిరా - మిక్కిలి చక్కని శ్రీయగు లక్ష్మీదేవియొక్క హృదయమేని వాసము గాఁగలరామా!

‡ 'కౌఁగలింతురా' అనుపాఠము అపశబ్దము.

ఎంతని - ఎంతమాత్రమని
వర్ణింతురా - వర్ణన చేయుదురా
నిజముగఁ - నిశ్చయముగ
నీదు పలుకే పలుకురా - నీమాటయే మాట

నీ కులుకే కులుకురా - నీవిలాసమే విలాసమురా
నీదు తళుకే తళుకురా - నీదు ప్రకాశమే ప్రకాశమురా
త్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడఁబడు రామా
(ఎందుఁ గౌఁగిలింతురా)

విశేషార్థము :—ఇందు 'నారీణాముత్తమావధూః' అనునటులు సౌందర్యాదులచే లక్ష్మీదేవి కన్న చక్కనివారలు మఱియొకరు లేరు ; అట్టి రూపవతియు, సుకుమారవతియు నగు లక్ష్మీదేవియే భగవంతుని తన మనస్సునందు నిలుపుకొనియున్నది. అట్టి భగవంతుని ఏ దివ్యావయవమును నిర్దేశించి ముద్దిడవచ్చును ; కౌగిలింపవచ్చును ; 'వదనం మధురం వచనం మధురం మధురాధిపతే రఖిలం మధురమ్' అనునటులు భగవంతునియొక్క ముఖము వానిమాట, సర్వము భోగ్యముగ నున్నది. అనుభవించువాఁడుగాని, వర్ణించువాఁడుగాని ముందుపడి యే యవయవమును నెత్తిచెప్పఁగలఁడు? అన్నియు గుమ్మడికాయయంత ముత్యములుగనే యున్నయవి. 'యతోవాచోనివర్తన్తే' అనునటులు వేదపురుషుఁడు భగవంతుని యానందగుణము నొకదానిని మాత్రము వర్ణిం

చుటకు శక్తి లేనివాఁడై యిది యవాఙ్మానసగోచరమనెను. అట్లే త్యాగయ్యగారును వర్ణింపఁజాలక వేఱొక ఉపమాన వస్తువు దొరకనందున, పలుకే పలుకు, కులుకే కులుకు, తళుకే తళుకు అని విరమించినారని భావము.

శుద్ధదేశి రాగ లక్షణము :—షాడవ సంపూర్ణ రాగము. 20 వ మేళం నటభైరవి జన్యము. ఆరోహణమునందు శుద్ధ మధ్యమ చతుశ్శ్రుతి ధైవతములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడు గానము సేయఁదగినది.

| ఆరోహణము. | అవరోహణము. |
|---|---|
| స రి మ ప ధ ని స. | స ని ధ ప మ గ రి స. |

వేంకటమఖి తన చతుర్దండిప్రకాశిక అను గ్రంథములో నీ రాగమునకు ప్రయోగము "సరిమపధనిధస - సనిధపమమగరిస" యని వ్రాసియున్నారు. అవరోహణమునందుఁగల ప్రయోగములు మిగుల రాగరంజకమైన యవియే. ఆరోహణమునందు "పధనిధస" యను ప్రయోగమును స్వీకరించినయెడల సదరు రాగము బొత్తుగా ముఖారి యగుచున్నది. కనుక సదరు

ప్రయోగమును వర్జించుటయే యుత్తమము. పదసరి అను ప్రయోగము కొన్ని తావులలో ప్రయోగించియుండుట నీ క్రింది కీర్తనయందుఁ జూచునది.

| | | | | |
|---|---|---|---|---|
| ప. ; | * సాన్‌సా - గారీమా ; | ; - గారీగా | గరిరీ - రిగగరి | ‖ |
| ; | * ఎం . దు - కా. గి ; | ; - లిం. తు | ర.. - ..ని | ‖ |
| రిస | * సాన్‌సా - గారీ - మపమప | మప - మగగాగా | ,, | ‖ |
| .. | * స్నేం. దు - కా. - గి . . . | .. - లిం. . తు | ,, | ‖ |
| ,, | * ,, - గారీమాపా | , ధ - ప <గరిగా | ,, | ‖ |
| ,, | * ,, - కా. గి . | , . - లిం. . . తు | ,, | ‖ |
| ,, | * సాన్‌సా - రీమా - పధనిధ | పమ - మగగాగా | ,, | ‖ |
| ,, | * ఎం . దు - కొ. - గి . . . | .. - లిం . తు | ,, | ‖ |
| ,, | * రీ , మ - పాధా ; - పధనిధ | నీ - నిదధపమా | పా ; - ధపమగ | ‖ |
| ,, | * నెం, త - ని వ ; - . . . . | . - ర్థిం. . తు | రా ; - .. నే. | ‖ |

రిప * ,, - పధపధ | నిసి - ,, | ,, ||

.. * ,, - .... | .. - ,, | ,, ||

,, * ,, - పధసరి | గరి - రిసనిధపమ | ,, ||

,, * ,, - .... | .. - ణ్ణిం...తు | ,, ||

,, *

,, * (రెండు)

అ. ; * పా ; ధా - నీ ; - ధపమధ | , మ - పా ; ధా | నీని - సా ; ||

; * అం ; ద - మై, - న .... | , . - ము౦ ; ద | రన - నా ; ||

; * సా ; సా - సనినీ - నిధనీ | ; - నిధధపమా | పా ; - ధపమగ ||

; * ఇం ; ది - రా.. - హృ , | : - న౦ం . ది | రా ; - .. నే, ||

రిసి *

.. * (రెండు)

అవతారిక :—ఈ కీర్తనమునం దయ్యగారు శ్రీరాముని స్వభావ గుణములు ఇతర దేవతల యొక్క గుణములకన్న వేఱైనవిగాను అనంతములుగా నుండుటయు నెఱింగినవారై దేవతాంతర భజనము కూడదని వచియించుచున్నారు.

(13) పూర్ణషడ్జము - రూపకము.

ప. లావణ్యరామ కను - లారఁ జూడవే అతి (లా)

అ. శ్రీవనితాచిత్తకుముద - శీతకర ¶జితానన్యజ (లా)

చ. నీమనసు నీసొగసు - నీదినుసు వేఱే

తామసమత దైవ మేల త్యాగరాజ నుత దివ్య (లా)

ప్రతిపదార్థము.

| | |
|---|---|
| లావణ్య రామా - సుందర రాముఁడా | చూడవే - చూడుమా |
| కన్నులారన్ - కన్నులారఁగా | అతి లావణ్య రామ - మిక్కిలి సుందరుఁడైనరాముఁడా |

¶ 'శతానన్యజ' అను పాఠము అశుద్ధము.

శ్రీవనితా - చిత్తకుముద శీతకర - లక్ష్మియొక్క మనస్సనెడి తెల్లకలువ పూవునకు చంద్రునివలె వికాసముఁ జేయువాఁడా

జితానన్యజ - మన్మథుని జయించినట్టి లావణ్యము గలవాఁడా

నీమనసు - నీయొక్క అంతరంగమును

నీ సొగసు - నీయొక్క అందమును

నీదినుసు - నీస్వభావమును

వేఱే - వేఱే విధము

తామస ప్రకృత దైవమేల? - తామసగుణములతో సంబంధించు దైవమేల?

త్యా! రాజనుత - త్యాగరాజుచే స్తుతింపఁబడిన వాఁడా

దివ్య లావణ్య రామా - దివ్యమగు సౌందర్యము గల రాముఁడా

విశేషార్థము :— 'లావణ్యరామ కనులారఁ జూడ' అనుటచే 'రూపదాక్షిణ్య సంపన్నః ప్రసూతో జనకాత్మజే' అని శ్రీ ఆంజనేయులు చెప్పినటుల రూపముచేతను దాక్షిణ్యముచేతను గూడుకొనియున్న రామా! 'సాధూనా ముపకారజ్ఞః' అనునటులు సాధుజనులను రక్షించువాఁడా! నన్ను సంపూర్ణముగ రక్షింపుము అనుచున్నారు భావము

'శ్రీవనితా చిత్తకుముద. జితానన్యజ' అనుటచే 'సాక్షాన్మన్మథ మన్మథః' అనునటులు అనేక మన్మథుల చక్కఁదనమునొకటిగఁ జేర్చినటులెను యున్న చక్కని రామా! సాటిలేని అంద

కర్త్రియగు లక్ష్మీదేవియొక్క మనస్సనెడు కుముదమునకు చంద్రునివంటివాఁడవై నను సంతోష పెట్టుచున్నావు. అట్లే నామనసుకును సంతోషమును గలిగింపుమని భావము.

'నీ మనసు' అనుటచే, 'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుః । ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి ॥' అనునటులు, నిన్నాశ్రయించినవారల సుఖదుఃఖములను నీవిగనె భావించి వాని నీ యాశ్రితులకన్న నధికముగనే యనుభవించుచున్నావు. కనుకనే నీమనస్సు సాటిలేనిదిగ నున్నది.

'నీ సొగసు' అనుటచే శాకిని, ఢాకిని అనునట్టి దేవతలవలె ఘోరస్వరూపముగ లేక 'గంధర్వరాజ ప్రతిమం? సర్వసత్త్వమనోహరః' అనునటులు గంధర్వరాజువలె మెంతు చక్కఁదనము కలిగినవాఁడవై కేవలము మృగములనుగూడ ఆకర్షించునట్టి యనేక సుగుణములను గలవాఁడవై వెలయుచున్నావు. కనుక నీసొగసే సొగసనంబడును అని భావము.

'నీ దినుసు,' అనుటచే, 'మద్భక్తం శ్వపచం వాపి' అనునటులు చండాలజాతిలోఁ బుట్టినవాఁడైనను నీదు భక్తుఁడే నీకు గొప్పవాఁడు. విభీషణుఁడు శరణాగతి చేసినసమయమున 'అభయం

సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ । విభీషణో వా సుగ్రీవ యదివా రావణస్స్వయమ్' అను నటులు నీవు సుగ్రీవునితో, 'సుగ్రీవా! వచ్చినవాఁడు విభీషణుఁడుగాని రావణుఁడుగాని నేను రక్షింపనే సిద్ధపడియున్నాను; సమస్త భూతములకు నభయమిచ్చుటయే నామవ్రతము; వచ్చినవానిని తోడితెమ్ము' అని పలికిన ఔదార్యశీలుఁడవు నీవే గదా! ఇట్టివాఁడు లోకమునందెందుకఁడు లేఁడు. కనుకనే నీదినుసు లోకులయొక్క దినుసుకన్న వేఱైనదని చెప్పుచున్నారని భావము.

'తామసమత దైవమేల' అనుటచే, అనంత కల్యాణగుణ సంపన్నుఁడైన శ్రీరామునిఁ గొలువక 'అట్టదు పోదుం శుట్టదై కొండువా' అనునట్టి క్షుద్రదేవతల యుపాసనచే ఎంతమాత్రము క్షేమము కలుగదనుచున్నారు.

'కరుత్త మనమొన్నుం వేడాం - కణ్ణనల్లాల్ తెయ్వమిల్లై'

'కర్పా ఇరామపిరానైయల్లాల్ - మఱ్ఱుం కర్పరో'

అని ఆళ్వారును నొక్కి చెప్పిరి.

పూర్ణషడ్జ రాగ లక్షణము: ఇది 20 వ మేళమైన నఠభైరవియందు జనించినది. షాడవ రాగము, ధైవత వర్జ్యము. సాధారణ గాంధార శుద్ధ మధ్యమ కైశికీ నిషాదములు రాగ చ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడు పాడదగినది.

ఆరోహణము. అవరోహణము.

స రి గ మ ప ని సా. సా ని ప మ గ రి స.

ప. నీసా | నీ – పా ; మా || గమగా | గా – రీగరిసీ ; – సా ||
లా. | . – వ ; ణ్యా . || రా. . | మ – క. . . ; – న్నా ||
; నీ | సా – రీ గాగా || మా ; | ; ; – పానీ ||
; లా | ర జూ. డ || వే ; | ; ; – అతి ||

2 సనిసరి | సని – సనిపనిపస || స్సనిపస | గరి . – రీగరిసీ ; – సా ||
లా. . . | . . వ . . . . ణ్యా || రా. . | మ – క. . . ; – న్నా ||
; నీ | సా – రీ గాగా || మా – | ; ; – పానీ ||
; లా | ర – జూ. డ || వే – | ; ; – అతి ||

అవతారిక:—ఈకీర్తనమునందు అయ్యగారు, శ్రీరామా! భక్తుడనగు నాపై నీవు కోపగించినయెడల నే నెచ్చోటికిఁ బోదును? నా కొఱఁతలను నే నెవరితో మొఱపెట్టి చెప్పుకొందును? అనన్యగతికుఁడనైన నన్ను రక్షించుటయందు కాలయాపనము చేసినచో నుంతయు తాళలే నను చున్నారు.

(14) మార్గహిందోళము - దేశాది.

ప. చలమేలరా సాకేతరామ (చ)

అ. వలచి భక్తి మార్గముతోను నిన్ను - వర్ణించుచున్న నాపై (చ)

చ. ఎందుఁబోదు నే నేమి సేయుదును - ఎచ్చోట నే మొఱ పెట్టుదును (చ)
దంధలతో ప్రొద్దు పోవలెనా - తాళజాలర † త్యాగరాజనుత (చ)

---

† 'త్యాగరాజనుత తాళఁగఁజాలర' అని యొక పాఠము ఇది సరియైన పాఠముగాదు అని చెప్పుచున్నారు.

ప్రతిపదార్థము.

చలమేలరా - కోపమేలరా

సాకేతరామ - అయోధ్యారామ

వలచి - మోహించి

భక్తిమార్గముతోను - భక్తిమార్గమునను

నిన్నుఁ - నిన్ను

వర్ణించుచున్న నాపైఁ - స్తుతించుచున్న నాపైని (చల మేల

ఎందుఁబోదు - ఎచ్చటికిఁ బోవుదును.

నేఁ - నేను

ఏమిసేతునునుు - ఏమి చేయుదును

ఏచోట్లఁ - ఏచోటను

మెఁ జెట్టువాను - మొఱలిడువాఁడను

దండములతోఁ - టక్కులతో

ప్రొద్దుపోవలెనా - కాలమూహీనము జరుగవలెనా

తాళఁజాలరా - నేఁ దాళలేను

త్యాగరాజనుత - త్యాగరాజుచే స్తుతింపఁబడినవాఁడా

విశేషార్థము:— 'చలమేలరా...రామా' అనుటచే 'సహిదేవై రుదీర్ణస్య రావణస్య వధార్థినః। అర్థితో మానుషేలోకే జజ్ఞే విష్ణుస్సనాతనః' అనునటులు దేవతల వేఁడికోలున రావణుని జంపుటకై మాయామానుషవిగ్రహుండై అయోధ్యాపట్టణమునందు రాముఁడై యవతరించిన నీవే చలముచేయఁదగునా ? అని భావము.

అవతారిక:——ఈ కీర్తనమునం దయ్యగారు, రామభజనముతోఁ గూడియుండు సంగీతము మోక్షము నిచ్చునట్టిదని మనస్సునకు బోధించుచున్నారు.

(15) ముఖారి - దేశాది.

ప. సంగీత శాస్త్ర జ్ఞానము - సారూప్య సౌఖ్యదమే మనసా (సం)

అ. శృంగార రసాద్యఖిల సార పూ - రిత రామకథా నందాబ్ధి యుత (సం)

చ. ప్రేమ భక్తిసుజన వాత్సల్యము - శ్రీసుద్రమా [illegible] కటాక్షము
నేమము నిష్ఠ యశోధనము గలుగున - నేర్పు కల్గు త్యాగరాజ నేర్చిన (సం)

ప్రతిపదార్థము.

మనసా - ఓమనసా
'శృంగార...యుత... ...సంగీతజ్ఞానము'
శృంగార రసాది - శృంగారి రసము మొదలగుగల
అఖిల - అన్నిగనములయొక్క—

[illegible] - నర్పుచే
[illegible] - నిండిన [illegible]
[illegible] - [illegible]
ఆనంద [illegible] - ఆనంద సముద్రముతోఁ గూడినది

పాదయుగములకే (మ్రొక్కి) – వాని రెంటి
పాదములయందు సాష్టాంగముగ ప్రణమిల్లి
ఇనకులపతి సముఖంబున నే – సూర్యకుల తిలకుడైన
మున యెదుటనే
పునరావృత్తి రహితపదమును – జన్మరహితమైన పరమ
పదమును

పొందెన – పొందిన
త్యాగరాజ వినుతుని రాలి పుణ్యమును – త్యాగరాజుచే
నినుతింపబడిన రామభక్తురాలగు శబరియొక్క పుణ్య
మును
(ఎంతని నే వర్ణింతును)

విశేషార్థము:—ఈ కీర్తనముచే ఆచార్యభక్తి ప్రభావము వెల్లడియగుచున్నది. 'ఎంతని నే వర్ణింతును శబరీ భాగ్యము' అనుటచే శబరియొక్క భాగ్యము మితిలేనిదని ప్రశంసించుచున్నారు.

'భగవద్వందనం స్వాద్యం గురువందన పూర్వకమ్। క్షీరం శర్కరయా యుక్తం స్వదతే హి విశేషతః' అనగా చక్కెరతోఁ గూడిన పాలు కడు రుచి యధికమగు నట్లు ఆచార్యవందన పూర్వముగఁ జేయఁబడు గురువందనము మిగుల సార్థకమగు నున్నది. మఱియు, 'యస్మాద్దేవో జగన్నాథః కృత్వా మర్త్యమయీం తనుమ్। మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా

తస్మాద్భక్తిర్గురౌ కార్యా సంసార భయభీరుణా', అని జాబాల్య సంహితలో చెప్పినప్రకారముగ భగవంతుఁడు మానుషశరీరము నెత్తి 'కరుణగలిగినవాఁడై శాస్త్రముచే చేతులతో ధర్మసంస్థాపన ముచేయుచున్నాఁడు; అటులే ఆచార్యుఁడును సంసార సముద్రమునందు మునిఁగి దరిగానకయున్న వానిని జ్ఞానమను తెప్పమీఁద నెక్కించి తాను నావికుఁడుగనుండి యా సముద్రమును దాఁటించి ముక్తునిగఁ జేయుచున్నాఁడు. ఆ కారణముచేత భగవంతునివలెనె గురువును వందనీయుఁడని యెఱుఁగవలయును. మఱియు ఆచార్యుని నమస్కరించునపుడు, 'దండవత్ప్రణమేద్భూమౌ నిర్లజ్జో గురుసన్నిధౌ। శరీరమర్థం ప్రాణాంశ్చ సద్గురుభ్యో నివేదయేత్' అనఁగా గురుసన్నిధిలో కొంచెమైనను లజ్జలేనివాఁడై కఱ్ఱవలె భూమిమీఁదఁబడి సాష్టాంగముగ నమస్కరించి తన శరీరము అర్థము ప్రాణము అను ఈ మూఁటిని వానికొఱకై సమర్పింపవలయును. అట్లు చేయువాఁడు సులభముగ ఉత్తమగతిని పొందుచున్నాఁడు. సులభమార్గముగ నుండు, 'చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యన్తు యస్స్మరేత్ । కరస్థముదకం త్యక్త్వా ఘనస్థమభివాఞ్ఛతి ॥ సులభం తు గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే । బద్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేషతే క్షితౌ' అనునటులు, తన

యెదుట ప్రత్యక్షముగ నుండువాఁడును, మిగుల సులభుండు నగు గురువును వదలిపెట్టి శాస్త్రములచే నెఱుఁగఁదగినవాఁడును దుర్లభుండు నగు భగవంతుని శరణుచొచ్చువాఁడు, చేతనున్న నీటిని పాఱబోసి మేఘమునందున్న నీటి నెదురుచూచువానివలెనును; తనయంత నున్న నవరాలమూటలను పాఱబోసి భూమియందు గుప్తమై యుండు నిధిని కోరుచున్న వానివలెనును, వ్యర్థుఁడగును. కనుక పెద్దలు గురుభక్తినే విశేషముగ చేయుచున్నారు. శబరి, జాతిచే నీచమైనదియైనను తన గురువైన మతంగమహామునికొఱకై తాను చేసిన ఆచారోపచారములచేతను భక్తిచేతను ప్రసిద్ధికెక్కినదియై యుండినందువలన, తన యాచార్యునకును లభింపని శ్రీరాముని దర్శనము తనకు లభించినది. మఱియు, 'శబరీ మభ్యుపేయతుః' అనునటులు వేదముచేతను గానరాని శ్రీరాముఁడు శబరి యుండినచోటికి తానుగనే విచ్చేసెను. కనుకనే శబరిభాగ్యము చెప్ప తరముకానిదని అయ్యగారు తెలుపుచున్నారు.

'దాంతుల...యుండఁగ' అనుటచే, 'తపః ప్రభావముచే గొప్పవారలై వెలయుచుండు ఋషులయొక్క పత్నులెందఱో యుండఁగ జాతిచే నీచమైన శబరికి ఇట్టిభాగ్యము లభించిన గురుశుశ్రూషచేఁ గలిగిన ! ! అని భావము.

'కనుల ర...పుణ్యంబును' అనుటచే, 'తౌ చేద్దృష్ట్వా తథాసిద్ధా సముత్థాయ కృతాంజలిః । రామస్య పాద జగ్రాహ లక్ష్మణస్య చ ధీమతః ॥ పాద్య మాచమనీయం చ సర్వం ప్రాదాద్యథా విధి ॥' అనునటులు, రామలక్ష్మణులను కనులార సేవించి వారలకు అర్ఘ్యపాద్యాచమనీయములను సమర్పించి, తన శరీరము పులకరించునట్లుగా వారల పాదములను బట్టుకొని, వారలచే కుశలప్రశ్నము చేయబడినదియై వెలసి, 'మయాతు వివిధం వన్యం సంచితం పురుషర్షభ । తవార్థే పురుష వ్యాఘ్ర పంపాయా స్తీర సంభవమ్' అనునటులు తాను పంపాసరస్సుయొక్క తీరమునందు గల వనములలో నుండి సంపాదించి రుచిచూచి పెట్టియుండిన ఫలములను శ్రీరామునికి సమర్పించి, శ్రీరామలక్ష్మణులకు మతంగాశ్రమమునంతయును జూపుచు తన గురుప్రభావమును వెల్లడిచేసి వారలను సంతోషపఱచి, శ్రీరామానుమతిని బడసి వాని ముంగలనే అగ్నియందు తన జీర్ణశరీరమును ఆహుతిచేసి, 'దివ్యాభరణసంయుక్తా దివ్యమాల్యానులేపనా । దివ్యాంబరధరా తత్ర బభూవ ప్రియదర్శనా ॥ విరాజయంతీ తం దేశం విద్యు త్సౌదామినీ యథా ॥ యత్ర తే సుకృతాత్మానో విహరంతి మహర్షయః । తత్పుణ్యం శబరీస్థానం జగా మాత్మసమాధినా॥' అనునటులు ఉత్తమ

గరిరీ | సాం - సనిధాపా || మపధప | పమగరిమాపా ||
షం. | త - నిం . డి || యుం. | . . . . డగ ||

స. మాపా | పమగారీసా || రీమా | పా ; ధాపా ||
క ను | లా. . . ర || చే. | విం ; . చి ||

2 మాధప | ,, || ,, | పా ; ధాపా ||
క న. | ,, || ,, | విం ; . చి ||

3 సాధప | పమగారీసా || ,, | పా ; ధాపా ||
క నా. | లా. . . ర || ,, | విం ; . చి ||

రిమపధ | నీ నీనీనీ || ధాసని | నిదధా - పా ||
క . . . | మ్మనిఫల || ము . ల | నొ. స - గి ; ||

ధామా | పామాగారీ || పరిమా | గా - రీసా ; ||
త ను | వు ఫలక || రిం . | . - జపా; ||

సీ ధా | సారీమాపా || నీ నిధా నినీపా - ధపధా ||
దయ | గ ములశు || మో . . . . - క్రి .

నీధా | నీపా - ధాపా || మపధప ప సగరి - మాపా ||
ఇ న | కుల - ప తి || స .ము. ఖు . . - బు న ||

పామా | నీధానీ ; || ధాసా సనిదా - ధాపా ||
పు న | రా. వృ; || త్తి ర హి త - ప ద ||

నీధా | సా ; - రీశీ || సరిమా రీ - రిగరీసా ||
మును | బోం; - ధిన || త్యా . గ - రా . . జ ||

గరిరీ | సా - స నిధాపా || మపధప ప సగరి - మాపా ||
వి .ను | తు - రా . . లి || ఘ . . ణ్యం . . - బు ను || (ఎంతని)



అవతారిక — ఈ కీర్తనమునం దయ్యగారు; శ్రీరామా లోకమునం దధర్మము చాలవృద్ధి నొందుచున్నది. అందుచే నీ భక్తులకు కష్టములు గలుగుచున్నవి. నీ విప్పుడే యవతరించి నీకు భక్తులను బ్రోవవలయు నచుచున్నాను.

(47) ముఖారి - ఆది.

ప. సరసీరుహాసన రామ - సమయము బ్రోవ చిద్ఘన (స)

అ. పర భామల నర్చించి యన్నమిడి పగలు రేయి సర పమూఁడు వారి నొల్ల (స)

చ. బ్రాహ్మణ్యము పోయె నీచుల - బ్రతుకాయె నది గాక యీ కలిలో
బ్రాహ్మమైన మాటల నేర్చుకొని - పరఁగెదరయ్య త్యాగరాజనుత (స)

ప్రతిపదార్థము.

| | |
|---|---|
| సరసీరుహాసన - తా. సరసీరుహలవంటి కన్నులుగలవాఁడా | బ్రోవన్ - బ్రోచుటకు |
| రామా - శ్రీరామా | సమయము - ఇది సమయము |
| చిద్ఘన - చిదానంద ఘనుఁడా | పరభామలన్ - పర స్త్రీలను |

అర్చించి - ఉపచరించి
అన్నము ఇడి - అన్నము బెట్టి
పగలు - పగలును
రేయి - రాత్రియును
సరసము ఆడువారిన్ - సరసము సలుపువారిని
ఒల్లన్ - నే నామోదించను
(పరుసీరుహా)
ఈకలిలోన్ - ఈ కలియుగము నందు
బ్రాహ్మణ్యము - బ్రాహ్మణవృత్తి
పోయెన్ - నశించెను

నీచుల బ్రతుకు - నీచులయొక్క వృత్తి
ఆయెన్ - అధికమాయెను
అది గాక - అదియునుంగాక
బ్రాహ్మమైన - బ్రహ్మ సంబంధమైన
మాటలన్ - మాటలను
నేర్చుకొని - నేర్చుకొని
పరంగాదరు అయ్యా - తిరిగెదరు అయ్యా
త్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడబడు రామా
(సరుసీరుహానన)

విశేషార్థము:—శ్రీరామా! గాలి గూడుకొనియున్న నిప్పువలె ఈకలిపురుషుని సాహాయ్యముచేత అధర్మము వృద్ధిఁ బొందుచున్నది సనాతన ధర్మములు మఱుఁగుపడినవి ధర్మములను కాపాడుటయే స్వధర్మముగఁ గల బ్రాహ్మణులే తమ బ్రాహ్మణధర్మములను వదలి నీచవృత్తి

చేయుట కారంభించి వేషభాషలచే మాత్రము బ్రాహ్మణులుగఁ దిరుగుచున్నారు. పరస్త్రీగమనము మున్నగు పరమ నీచకార్యములను చేయుచు వేషముచే మాత్రము బ్రాహ్మణులుగ నుండు ఇట్టి భ్రష్టులను నేనెంతమాత్రము గౌరవింపను. ఇట్టి దుర్మార్గుల సహవాసముచే లోకము చెడిపోవుట మాత్రమే గాక సన్మార్గము నవలంబించియుండు నీదుభక్తులకును ఆపద గలుగును. 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్ । ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' అనునటులు నీవు దుష్టనిగ్రహ శిష్ట పరిపాలనార్థముగ ఒక్కొక్క యుగమునందును అవతరించు వాఁడవు కనుక నీ విప్పుడే అవతరించి యీ దుష్టులను దునిమి నీభక్తులను కాపాడవలయునని అయ్యగారు ప్రార్థించుచున్నారని భావము.

ప. ; ; ; * పామా – మగరిస – రీ | మా ; ; – ధా | పా ; – ; ; ||
; ; ; * స ర – సీ . . . – రు | హ ; ; – న | న ; – ; ; ||

2. రి మపా ; * ,, | ,, | పా ; ; – రిమ ||
రా. మా ; * ,, | ,, | న ; ; – రా ||

3\. రిమపా ; ,, | ,, | పా ; - ; రిమ ||
. . మా ; ,, | ,, | న ; - ; రా ||

4\. మగరిసరిమ * ,, | ,, | సా ; - రిమ ||
. . .మ. * ,, | ,, | న ; - రా ||

5\. పాధని-ధనీధ * ,, | ,, | ,, ||
మ . * ,, | ,, | ,, ||

6\. పనీధ సనిధ * ,, | ,, | ,, ||
మ. . . . * ,, | ,, | ,, ||

7\. పనిదధసా * సనిధప - మగరిస - రీ | ,, | ,, ||
మ . . * స . ర . - సీ . . . - రు | ,, | ,, ||

8\. పనిధస రీగరి* సనిధప - మగరిస - రీ | ధపమగ - రిమపా | నిధపమ . పధసా ||
మ . స ర . - సీ . . . - రు , | హా . . - . . సి | న . . - . . రా ||

| | | | |
|---|---|---|---|
| సా , సా , * | ,, | ,, | నరి - సా రినూరిను గరీ ‖ |
| ను , త , * | ,, | ,, | గ . - రా . . . జ ‖ |

సా రీసరిగరిసా *
ను త ;* (సరసీరుహా)

ఆవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరామ భజనము నరకములను పా చేసి యముని చింత క్రాంతునిగఁ జేసెనని తెలుపుచున్నారు.

(48) ముఖారి ఆది.

ప. చింతించుచున్నాఁడే యముఁడు (చిం

అ. సంతతము సుజనులెల్ల సద్భజనచేయుటఁ జూచి (చిం

చ. శూలపాశధర భటజాలములఁ జూచి మఱి మీ
కోలాహలము లుడిగెడు కాలమాయెనె యనుచు (చిం

2. వారిధి శోషింపఁజేయు క్రూరకుంభజునిరీతి
ఘోర నరకాదుల నణఁచు తారకనామమును దలఁచి (చిం)

3. దారి తెలియ లేక తిరుగువారలైనఁ జాలునని
సారముగఁ ద్యాగరాజు సంకీర్తనముఁ బాడెదరనుచు (చిం)

ప్రతిపదార్థము.

యముఁడు - జముఁడు
చింతించుచున్నాఁడు ఫే - చింతనొందుచున్నాఁడు గదా
సంతతము - ఎల్లప్పుడును
సుజనులు ఎల్లన్ - పుణ్యపురుషులెల్ల
సద్భజన - సత్తగు రామభజనమును
చేయుటన్ - చేయుటచేతను
చూచి - కని
'శూల,..జాలములు'
శూల - శూలములను
పాశ - పాశములను
ధర - చేకొనియుండు
భటజాలములన్ - దూతల గుంపులను (యమదూతలను)
చూచి - కని (చింతించు)
మతి - ఇఁకను
మీ - మీయొక్క
కోలాహలములు - సంతోషములు

ఉడిగెడు - నశించెడు

కాలము - సమయము

ఆయెను అనుచున్ - ఆ యనదని చెప్పుచు

(చింతించుచున్నాఁడే)

వారిధిన్ - సముద్రమును

శోషింపన్ చేయు - నీరులేనిదిగా చేయునట్టి

క్రూరకుంభజునిరీతిన్ - ఘోరమైన తపములచే ప్రసిద్ధి

కెక్కినట్టి అగస్త్యునివలెనే

ఘోర నరకాదులన్ - భయంకరమైన నరకములను

అణఁచు - నాశము చేయునట్టి [తలఁచి

తారకనామమును తలఁచి - శ్రీరామతారక మంత్రమును

(చింతించుచున్నాఁడే)

దారి తెలియులేక - దరిగానక, భక్తి చేయుటకైన కట్టు

బొట్టులు తెలియక

తిరుగువారలు వినన్ - తిరుగుచుండు వారలైనను

చాలును అనినన్ - చాలు ననినచో

సారముగ - సత్తుగ

త్యాగరాజు - త్యాగరాజు చేసిన

సంకీర్తనమున్ - మంచికీర్తనములను

పాడెదరు అనుచున్ - పాడుచున్నారనుచు

(చింతించుచున్నాఁడే)

విశేషార్థము:—'కరణంబులు భవసాగర। తరణంబులు శుభరమావతరణంబులు సా। దరణంబులు జితకలుషా। చరణంబులు హరిపదాబ్జసంస్మరణంబుల్' అనునటులు, శ్రీహరి పాద

స్మరణంబు భవసాగరమున నుండి జీవుని దాటించుచున్నది. అందుచేత భవసాగరమునందు మునిఁగి యుండు వారిని బాధించుచుండు జమునిచేత భగవద్భజనము చేయు భాగవతుఁడు చిక్కుపడఁడు. 'చింతించుచున్నాఁడే యముఁడు' అనుటచే కలియుగమునందు అధర్మము లధికమగుటచే సమృద్ధి నొందియుండు యమలోకమును బాలింపఁ దలఁచిన యముఁడు చింత నొందుచున్నాఁడనుచున్నారు. ఏల చింత నొందుచున్నాఁడనఁగా? 'సంతతము సుజనులెల్ల సద్భజనముఁ జేయుటయునుజూచి' చింతించుచున్నాఁడనుచున్నారు. అనఁగా, వెనుక నొక సమయంబున రుక్మాంగదుఁడు మనుజులందఱితోను హరివాసరవ్రతము ననుష్ఠింపఁజేసిన యపుఁడు జముఁడు, పాడువాడిన యమలోకముగలవాఁడై బ్రహ్మయొద్దకుఁ జని,

క. నాలోకంబున నిప్పుడు, భూలోకమునరుఁ డొకండుఁ బొడకట్టఁడు నే
నేలాగున యమలోకము, పాలింపుదు హీనవృత్తిఁబడఁగాఁ జాలన్.

గీ. నరకములయందు మున్నున్న నరులు దివికిఁ
జనిరి తత్పుత్ర పౌత్రులు సలుపు వ్రతము

హత్యముఁ జేసి క్రొత్తసి రదుగుదెంచి
ప్రాతనీరును గొని పోవుభంగి మీఱు.' అనియు,

మ.త్త. 'చిత్రగుప్తుఁడు వ్రాతవ్రాయఁగఁ జేతులాడక యింటిలోఁ
జిత్ర మారకలు ఘుటము న్నిరసించి పాటుగ నైచె నోఁ
బత్రముల్ శిథిలంబులై యసిపత్రకాననముల్ దివా
రాత్రు లూరక వాఁడి చెప్పఁగరాదు పంకజసంభవా!'

మ.త్త. 'కాలదండము త్రుప్పుపట్టెను ఘాతుకక్రియ నిస్సిరో!
కాలపాశము కచ్చువిచ్చె నఖర్వవిక్రమ మొందఁగాఁ
గాలకింకరకోటి భీకర గర్వమెల్ల నణంగె నీ
లమేటి యమాధికారము! గైకొనుండు సమస్తముఁ.'

అనియు, మొఱఁబెట్టుకొన్నవాఁడు గనుక, ఇప్పుడు భూలోకము నందున్న వారందఱును శ్రీరామ

నామ భజనముచేయ నారంభించి యుండుటయును జూచి తన పరివారమునకు రాయించి, ఓ పరి
జనులారా! వెనుక నొకసమయమున నాను లోకము పాడువాటి యుండిన విషయము మీరు తెలియు
దురుగదా ? అది రుక్మాంగదునిచే గలిగినది. ఇపుడు త్యాగయ్య అను రామభక్తుండు చేయు
శ్రీరామ భజనచే మఱియొకసారి నా లోకము పాడై పోవునని తెలియుచున్నది. ఇట్లు నాకే కోలా
హల ముడిగిపోవుటకు కాలము వచ్చియున్నపుడు మీకు సంతోష మెక్కడిదని యముఁడు తన పరి
జనులతో చింతించుచున్నాఁడని భావము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప. | ; | * రీ మాపా - ధా ; నీధా | సా ; ; ; | నీ ధాపా ; | ‖ |
| | ; | * చింతించు - చు ; న్నా | డే ; ; , | యముడు ; | ‖ |
| | ; | * మాధాపా - మాగాగారీ | సా ; ; ; | మాధప - మగగరి | ‖ |
| | ; | * చింతించు - చు . న్నా | . ; ; ; | యము. - డు. . . | ‖ |
| | పా | * రీ మాపా - ధా ; నీధా | సా ; ; ; | నీ ధాపా ; | ‖ |
| | ; | * చింతించు - చు ; న్నా | . ; ; ; | యముడు ; | ‖ |

; * పమదధపా – పమగా – గరిరీ | సా ; ; ; | పాసా నిధపమ ||
; * చింతించు – చు. . – న్నా | . , , ; | యముడు . . ||

గరి * గమరిమామా – పా ; నీధా | పధసా – పధసా | నీ ధాపా , ||
. . * చిం. తించు – చు ; న్నా | డే. . – . . . | యము డు ; ||

; * పమదధపా – పమగా – గరిరీ | సా ; ; ; | పాసానిధపమ ||
; * చింతించు చు . – న్నా | డే , ; ; | యముడు . . ||

గరి * గరిమామా – పా ; నీధా | పధసరి – మగరిస | సనినిధపా ; ||
. . * చింతించు – చు , న్నా | డే. . . – . . . . | యు.ము.డు ; ||

; * పమదధపా – పమగా – గరిరీ | సా , ; ; | ; ; – ; ; ||
; * చింతించు – చు. . – న్నా | డే , ; , | ; ; – ; , ||

అ. ; * నీధాసా – రీ ; రీ ; | ; – సారీగా | గారీరీ ; ||
; * సం. త – త ; ము; | ; – సు జను | లె . ల్ల ; ||

; * ,, | ; - సరీమాగా | ,, ||
; * ,, | ; - సు. జ న | ,, ||

; * గారీసాసానీధాపా | ; - మా ధపమగ | గారీసా ; ||
; * స . ద్భ జ న సే . | ; - యు'. . . | జూ. చి ; ||

; *
; * (చింతించు చున్నాఁడే)

చ. ; * పా , ధపా - మా గారీసా | ; - గారీమా | పా ; ధాపా ||
; * నా , రి తె - లి యలే . | ; - క . తి | రి ; గ డు ||

; * పా ; మా గారీసా ; | ; - సారీమా | పాధాపా ; ||
; * వా ; ర లై న ; | ; - చా. లు | న ని న ; ||

; * నీధాసా - రీ ; రీ ; | ; - సరీమాగా | గారీరీ ; ||
; * సా. ర - ము ; గ ; | ; - త్యా . గ. | రా. జు; ||

; * గా ,సా సా నీ ధా పా | ; ,,మా ధపమ | గా కీ సా ; ||
; * పంకే . . . ర్త న ము | , - పా డెవ. | ర ను ము ; ||
; *
; * చింతిం చు చున్నా రే



అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు, భగవంతుండు శ్రీరాముఁడై యవతరించినది దుష్టనిగ్రహ శిష్ట పరిపాలనమునకే గాని మఱియొకటి కాదనుచున్నారు.

(49) ముఖారి - ఆది.

ప. ఏ లవతార మెత్తుకొంటివో - ఏమి కారణమో రాముఁడై (ఏ)

అ. ఆలము సేయుటకా అయోధ్య - పాలన సేయుటకా ఓ రాఘవా (ఏ)

చ యోగులను జూచుటకా భవ - రోగులనుఁ బ్రోచుటకా శత
రాగ ర వ కను రచించిన - త్యాగరాజునకు వర మొసఁగుటకా (ఏ)

## ప్రతిపదార్థము.

ఓ రాఘవా - ఓ రామ

ఏల - ఎందుకు

అవతారము - అవతారమును

ఎత్తుకొంటివి ఓ - తాల్చుకొంటివో

ఏమికారణము ఓ - ఏకారణము చేతనో

ఆజము సేయుటకా - యుద్ధము సేయుటకా

అయోధ్యా పాలన చేయుటకా - అయోధ్యాపట్టణమును పరిపాలనము సేయుటకా

(ఏలవతార)

యోగులను - ఋషులను

చూచుటకా - కటాక్షించుటకా

భవరోగులను - సంసారమను వ్యాధిచే పీడింపఁబడుచుండు వారిని

ప్రోచుటకా - రక్షించుటకా

శతరాగ రత్నమాలికను - అనేక రాగములను రత్నములచే పొదిగిన కీర్తనములచే నైన మాలను

రచించిన - చేసిన

త్యాగరాజునకు - త్యాగరాజునకు

వరము ఒసంగుటకా - వర మిచ్చుటకా

(ఏలవతార)

విశేషార్థము :—'ఏలవతారమెత్తుకొంటివో? ఏమి కారణమో?' అనుటచే, శ్రీరామా! నీవు ఈ రామావతారమునకు ముందు, కొన్ని యవతారములను ఎత్తితివి; అందొక్కొక్క యవ

తారమునం దొక్కొక్క-కార్యమునే చేసియున్నావు; ఈ రామావతారమునం దన్ననో యనేక కార్యములను చేసియున్నావు; ఈ కార్యములయం దెద్దానిని ముఖ్యమని తలంచి యీ యవతారము నెత్తితివి? ఇందుకు కారణమేమి? అనుచున్నారు. అనఁగా, వేదముల నపహరించుకొని సముద్రమునందు దాఁగిన సోమకాసురుని జంపి వేదోద్ధారణము సేయుటకై మత్స్యావతారము నెత్తితివి; అమృతమథనకాలమునందు మునిఁగిపోవుచుండిన మందరగిరిని వీఁపున మోసి దేవతలకమృత మొసఁగుటకై కూర్మావతారము నెత్తితివి; భూమినిఁ జుట్టుకొని పాతాళమునకుఁ బోయిన హిరణ్యాక్షునిఁ జంపి లోకోద్ధారణము సేయుటకై వరాహావతారమును దాల్చితివి; ముల్లోకములను వెతవఁజేసిన హిరణ్యకశిపునిఁ జంపి ప్రహ్లాదునిఁ బ్రోచుటకై నారసింహావతారము నెత్తితివి; బలిని యాచించి ఇంద్రసంపదలను కాపాడుటకై వామనావతారము నెత్తితివి; గర్వమునొందిన నీను సుదర్శనమునకు శాపవిమోచనము గావించుటకై పరశురామావతారము నెత్తితివి. అటులే ఏ కార్యమును ప్రధానముగఁ గొని యీ రామావతారము నెత్తితివి? అనుచున్నారనిభావము.

'ఆలము సేయుటకా...త్యాగరాజునకు వర మొసఁగుటకా' అనుటచే, ఈ యవతారమునందుఁ గల కార్య బాహుళ్యమును జూ. ని ం దెద్ది ముఖ్యమైనయది యనుచున్నారు. అనఁగా,

పూర్వావతారములం దెద్దానియందును చేయని గొప్ప యుద్ధములను జేయుటకా? పితృవాక్య పరిపాలనము, ధర్మములను ఆచరించుట, ప్రియముగ మాటలాడుట, హెచ్చుతక్కువ లేక యందఱను సమముగ నెంచి ధర్మప్రవర్తకంబు సేయుట మున్నగు అనేక విషయములను నిదర్శించుచు అయోధ్యానగరమును పరిపాలించుటకా? 'త్వం నాథాహీనయం వనే' అని నిన్నే నాథునిగ నమ్మియుండిన ఋషులను కాపాడుటకా? భవరోగులను బ్రోచుటకా? అనఁగా శాపముచేఁ గలిగినవియు, నిన్ను తప్ప మఱియొకరిచేఁ దీర్చుటకుఁ గానిదియునగు గొప్ప రోగముచేఁ గలిగిన పుట్టుకలను బడసి మగ్నులై యుండిన, అహల్య, విరాధుఁడు, కబంధుఁడు మున్నగు వారలను నీదు పాదధూళిచేతను పాదస్పర్శముచేతను అరోగులుగఁ జేయుటకా? లేక భవసాగరమునందు మునిఁగి దరిగానకయున్న వారలను నీదు నిర్హేతుక కృపాకటాక్షముచేఁ బ్రోవఁ దలఁచి, రామ యను నీదు నామముచే వారి పాపరాసులను బోఁగొట్టి, నీదు దర్శనమను బ్రహ్మానందపయోధియందు వారలను ముంచి బ్రోచుటకా? నీయందే మనస్సును నిలిపి నీకీర్తిని, అనేక రాగములయం దమర్చి సదా గానము చేయుచుండు నీ త్యాగరాజును రక్షించుటకా? ఈ కార్యములయం దెద్దానిని చేయుటకై. నీ పీ

యవతారము నెత్తుకొంటివో తెలియతేదు. విచారించుచవుడు, 'అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్' అను నీదు వాక్యముచేత నే, రాజ్యము, సంపదయు, తమ్ములు, భార్య, నీదు ప్రాణము సయితము, ధర్మ సంస్థాపనము చేయు విషయమునందు నీకు లక్ష్యము కావని తెలియు చున్నది. కనుక రాజ్యము చేయుటకుంగాని, భోగభాగ్యముల ననుభవించుటకుంగాని నీ వవతరింప లేదు. 'తదవశ్యం మయా కార్యం ఋషీణాం పరిపాలనమ్' అనునటులు నీకు భక్తులను బ్రోచుట యే నీకు గొప్ప కార్యముగ నున్నది. అందుచేత నీ వీ యవతారము నెత్తినది నీ దాసులుగ నుండు నావంటి వారలను గాపాడుటకే గదా? అని అయ్యగారు భగవంతుని భక్త పారతంత్ర్యమును రూపించుచున్నారని భావము.

| | | | |
|---|---|---|---|
| ప | పధసా ; - సనిధాపా - పమనిని | ధప - పమగరిపా | ; - రిగరిమసా ‖ |
| | ఏ . . ; - ల . . వ - తా . . . | ర . - మె . . త్తు | ; - కొంటివో ‖ |
| | పధసా ; - ధసరిసనీధాపా ; - పమనిని | ధప - పమగరిగస | ,, ‖ |
| | ఏ . . ; - ల . . . . . . వ ; - తా . . . | ర . - మె . త్తు . | ,, ‖ |

; * సాం , ససాం – సాం రీసనీ ; – ధాపా మగరీ – రిగసా | , – రిసరిమపా ||
; * పా , ల న – సే . . . ; యుటు రా . . – ఓ . . | ; – రా. నువ ||

చ. ; * పా , పపా . పమగా – రీ సా | ; – రిమరీమా | పా ; – పధనా ||
; * రో, గుల ను. . – ౽ ా. ; – ము. . ట | కా ; – గ. వ ||

; * నీ , ధపా మపధప – పమగా రిస – రిసరీగా | పా ; – పాంపా ||
; * రో, గుల ము . . . – బ్రో . . . – ము. . ట | కా ; – శ త ||

; * నీ , ధ – సాం ; రీ – రీ ; ; – రీ గాం రి సాం | రీ ; రీరీ ||
; * రా, గ – ర ; త్న – మా ; ; – లి క నుర | చిం; చిన ||

; * సాం , సాం – సాం రిసి – నీధాపాంపా | ; – పమానీ ధప | రి మరీ – గా సా ||
; * త్యా, గ – ర జు న రు ; – వర మొస. | గు. . – ట నం ||



అవతారిక:—ఇవి దివ్యనామ సంకీర్తనములు, ఇందు అయ్యగారు మానవజన్మమును బడసి యు జన్మ సాఫల్యమైన కార్యమును చేయక స్వరూప నాశనమునకైన కార్యములను చేయుచున్నారే! ఆహా! ఇట్టి నీచకార్యములను చేయుటకా ఈ జన్మమునెత్తి ఈ తనువును బెంచినది? అని పరితాపము నొందుచున్నారు.

50 ముఖారి చాపు.

ప. ఇందుకా యీ తనువును బెంచిన (ఇం)

చ. నీ సేవకులేక నీదు చెంతకురాక - యాశకు దాసులై యటునిటు తిరిగెద (ఇం)

2. నిరతము నీస్మృష్టి నే యార్జింపక - యొరుల భావముల నోరఁజూపుఁజూచెద (ఇం)

3. సారెకు నామస్మరణము సేయక - యూరిమాటలెల్ల నూరక వదరెద (ఇం)

4. కరముల బూజసేయక గానిఁ క డాసి - ధరలోన నన్న దుర్దానములకుఁ జాఁచెద (ఇం)

5. వారము నీక్షేత్ర వరముఁ జుట్టక - భూరికి ముందుగఁబోటి పాటి తిరిగెద (ఇం)

6. నీవాఁడని పేరు నిండు వహించెడు - నావాఁడని యముఁడు నవ్వుచు బాధించు (నిం)

7. రావయ్య శ్రీ త్యాగరాజవినుతా యని - భావించక ప్రొద్దు బాఱఁగొట్టుకొనెద (ఈ)

ప్రతిపదార్థము.

ఈ తనువును - ఈ శరీరమును

పెంచినది - కాపాడినది

ఇందుకు ఆ - ఇట్టి దుష్టకార్యములను చేయుటకా

నీ సేవకుఁ లేక - నీకు సేవను చేయుటకు లేక

నీదు చెంతకుఁ రాక - నీ సన్నిధికి రాక

ఆశకుఁ దాసులై - విషయములకు లోఁబడినవారలై

అటు ఇటు తిరిగెదరు - అక్కడ కిక్కడకు ఒనికియాలి తిరిగెదరు

(ఇందుకా)

నిరతము - ఎల్లప్పుడును

నీ దృష్టినే - నీదు కటాక్షముచే

ఆర్జింపక - సంపాదించక

ఒకల భామలను - పర స్త్రీలను

ఓరమాపులఁ - కడకంటితో

మాచెదరు - మాచుచున్నారు

(ఇందుకా)

సారకుఁ - మాటికిని

నామస్మరణముఁ - నీదు నామస్మరణమును

చేయక - చేయక

ఊరిమాటలు ఎల్లఁ - వ్యర్థపు మాటలను

ఊరక వదచెదరు - వగరుచున్నారు
(ఇందు కా)
కరములన్ - చేతులను
పూజకై - భగవంతుని పూజచే   బకై
కావింపక - ఉపయోగింపక
డాసి - సమీపించి
ధరలోనన్ - భూమియందుగల
అన్ని దుర్దానములకున్ - అన్ని నీచదానములకును
చాఁచెదరు - చేయిచాఁచెదరు
(ఇందు కా)
వారము - ఎల్లప్పుడును
నీ - నీయొక్క
క్షేత్రవరములన్ - సన్నిధి ప్రా   రములను
చుట్టక - ప్రదక్షిణము సేయక

భూరికిన్ - దక్షిణకు
ముందగన్ - శీఘ్రముగ
పాఱిపాఱి - పరుగిడి పరుగిడి
తిరిగెదరు - తిరుగుచున్నారు
(ఇందు కా)
నీవాఁడు అని - నీదు భక్తుఁడని
పేరున్ - పేరును
ఇందున్ - ఈలోకమునందు
వహించఁడు - పొందఁడు (అట్టివానిని)
యముఁడు - యముఁడు   [డైన పాపియని
నావాఁడు అని - నాచే దండములను బడయుట కర్హుఁ
నవ్వుచున్ - పరిహసించుచు
బాధించున్ - బాధలఁ బెట్టును
ఇందు కా)

శ్రీత్యాగరాజ వినుతా - శ్రీత్యాగరాజుచే గొనియాడఁ
బడువాఁడా
రావయ్య అని - దగ్గఱకు రావయ్య అని
భావించక - తలఁచక

ప్రాద్దుకా - కాలమును
పాటఁగా కొట్టెదరు - ప్రోఁగొట్టెదరు
(ఇంకను)

22

విశేషార్థము:—జీవుఁడు చేసిన జన్మాంతర పుణ్య విశేషమున వీనికి మానవ జన్మము లభించుచున్నది. ఈ యుత్తమ జన్మమునందే వీఁడు సన్మార్గము నవలంబించి భక్తిచేసి కృతార్థుఁడు కావలయును. ఈ మానవ శరీరమునందుఁ గల యొక్కొక్క అవయవమును, 'కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వాజిహ్వ...' అనునటులు భగవంతుని కైంకర్యముచేతనే అవయవమని చెప్పఁదగియున్నది. అట్లు గాకపోయినచో నీయవయవములు ఎండిపోయిన వృక్షము నందున్న కొమ్మలకన్న నీచమైనవి యనఁబడును, అనఁగ ఎండిపోయిన వృక్షపు కొమ్మలు ఇంధనములైన నుపయోగించును, ఈ యవయవములన్నను యెందుకు నుపయోగపడవు. కనుకనే అయ్యగారు, మనుజులు ఈ యుత్తమమైన మానవజన్మమును సద్విషయములకై యుపయోగించక

దుర్విషయములం దుప నాగించి కట్టకడకు జమునిచే చిక్కి నానావిధములగు బాధల ననుభవించి జన్మము నెత్తుటకు ప్రయత్నించుచున్నారే! అని పరితాపము నొందుచు మనుజులకు జాగ్రత్తం గలిగించు చున్నారని భావము.

ప. మరీ | మాపా || సా , | పా ; || పమా | నిధపా | ధపమ | గరిసా ||
ఇం | దు కా || . , | యీ, || త ను | వు. ను | బెం. | చి. న ||

చ. నీ | నిసధా || ధసని | ధపమా || పమా | నీ ధా || సమా | సాంసాం ||
నీ . | సే. . || వకు. | లే. క || నీ . | దుచెం || త కు | రా క ||

రీ గరిసాం || నీ , | ధాపా || మపా | నీధప | ధపమ | గరిసా ||
ఆ . శ . కు || గా, | సు లై || అటు | ని .టు | తిరి . | గా. ద ||

(ఇతర చరణములును ఇటులే పాడదగినవి.)



అవతారిక:— ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరామ! నేనజ్ఞతవల్ల కొంతకాలమైనను గడపక, చిన్నవయస్సున నుండియే నన్ను రక్షకుడవని యెఱిగి నీ చెలిమిని గోరుచుంటిని. అట్టి నన్నుఁ బ్రోచు విషయములోను నింత తామసమా ? అనుచున్నారు.

(51) ఆభోగి - ఆది.

ప. నన్నుఁ బ్రోవ నీకింత తామసమా - నాపై నేరమేమి పల్కు రామా (న)

అ. చిన్ననాఁడే నీ చెలిమి గలుగఁగోరి - చింతించ లేదా శ్రీరామా (న)

చ. నిజదాసవరులగు తమ్ములతో - నీవు బాగుగఁ బుట్టఁగ లేదా
గజరాజ రక్షక తనయులను - గని పెంచ లేదా త్యాగరాజనుత (న)

ప్రతిపదార్థము.

నన్నున్ - నన్ను
బ్రోవన్ - బ్రోచుటకు
నీకున్ - నీకు
ఇంత తామసమా - ఇంత కాల హరణమా

నాపైన్ - నామీఁద
నేరము - తప్పు
ఏమి - ఏమియున్నది
పల్కుమా - చెప్పుమా
చిన్ననాఁడే - చిఱుతప్రాయమునాఁడే
నీచెలిమి - నీమైత్రిని
కలుగఁగోరి - కలిగియుండుటకై యాసగొని
చింతింపన్ లేదా - చింత నొందలేదా
శ్రీరామా - శ్రీరామా
(నన్నుఁ బ్రోవ)

నిజదాసవరులు అను - నిజదాస శ్రేష్ఠులు
తమ్ములతోఁ - అనుజులతోను
నీవు - నీవు
బాగుగన్ - చక్కఁగ
పుట్టన్ కన్ లేదా - పుట్టలేదా
గజరాజరక్షక - ఇభరాజును రక్షించినవాఁడా
తనయులను - పుత్రులను
కనిపెంచలేదా - కని వర్ధిల్లఁ జేయలేదా
త్యాగరాజనుత - త్యాగరాజుచేఁ గొనియాడఁబడువాఁడా
(నన్నుఁ బ్రోవ నీకింత తామసమా)

విశేషార్థము:—ఈ కీర్తనమునందు గల 'గజరాజరక్షక ! తనయులను కని పెంచలేదా ?' అను వాక్యముచే, శ్రీరామా ! గజేంద్రుని రక్షించుటయందును, నీవు సొంతకొడుకులైన కుశలవులను వర్ధిల్లఁజేయుటయందును నీవు కాలహరణము చేసియున్నావు ; అట్లు కాలహరణము చేసి

సరమునకుఁ దగిన కారణములున్నవి. నన్నుఁ బ్రోచు విషయమునను కాలవిళంబము చేయుటకు నీ కెంతమాత్రము న్యాయము లేదు అనుచున్నారు. ఎనఁగా, గజేంద్రుఁడు మకరిచే నాక్రమింపఁ బడినవాఁడై చాలకాల మజ్ఞతచే నెవరెవరినో గూర్చి మొఱలిడుచుండి నందువలన వానికష్టము దీఱకపోయెను. వానికి అనన్య శరణజ్ఞానము గలిగి మూలపురుషుఁడైన భగవంతుఁడు తన్నుఁ గాపాడవలయునని మొఱవెట్టిన వెంటనే వాఁడు కాపాడ బడిన వాఁడైనాఁడు. ఆపద గలిగిన వెంటనే ఈ గజేంద్రుఁడు భగవంతునే శరణుఁజొచ్చి యున్న యెడల భగవంతుఁడు వానిఁ బ్రోచుటయం దంత కాలహరణము చేసియుండఁడు. కనుక ఈ కాలహరణమునకు గజేంద్రుని అజ్ఞతయే కారణమై యున్నది. ఇదిగాక, శ్రీరాముని సొంత కొడుకులైన కుశలవులు శ్రీరాముని తండ్రియని యెఱుఁగక యే యుండినందువలన వారికి న్యాయానుసారముగఁ గలుగవలసిన రాజభోగములు గలుగకపోయెను. అయ్యగారన్ననో చిఱుతప్రాయమునుండియే శ్రీరాముని చెలిమి గోరి వానిపై యనురాగముగలిగి యున్నవారు కనుక వీరిని బ్రోచు విషయమునందు భగవంతుఁడు కాలహరణము చేయుట కేమియు కారణము లేదనిభావము.

త్యాగరాజ

ఇందుఁగల మఱియొక భావము:—శ్రీరామా! చాలకాల మజ్ఞతచే నిన్నెఱుఁగక యుండిన గజేంద్రుఁడు నిన్ను, ఆదిమూలమా! అని పిలిచినవెంటనే,

మ. 'సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం - జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం - బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివా - దప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజ - ప్రాణావనోత్సాహియై.'

అనునటులు, వైకుంఠమునుండి పరుగిడివచ్చి వానిని కాపాడితివి. నిన్ను తండ్రియని యెఱుఁగకయే యుండిన నీదు కొడుకులైన కుశలవులు నీకు సన్నిధిఁ జొచ్చియున్న యపుడు, "చ. జనవరుఁడంత నొక్కదివసంబున వారితనూవిలాసముల్। కనుఁగొని జానకీవనశిశుల్ వడి నున్నవి పేరిరూపుల। వ్వనజదళాక్షికిన్ మును కవల్ జనియించి రటంచు వింటిన। తనయులె యా శుభాకృతులు తక్కిన నీ చెలువంబులుండునే' అనునటులు, వారియెడల పుత్రవాత్సల్యమును జూపి వాల్మీకాశ్రమమునందున్న జానకిని రావించి సభ్యులకు విషయమునంతయు వెల్లడిచేసి తుదకు లవుని ఉత్తరకోసలకునకు

రాజుగఁజేసి, యీ యన్నదమ్ము లిరువురికిని ఉన్న సంపదలను సమముగనిచ్చి వర్ధిల్లఁజేయలేదా? అట్లుండునప్పుడు చిన్ననాఁటనుండి నీపై అనురాగము గలిగియున్న నన్ను రక్షించుటయందు నీకెంత తామసమేమి. అట్లు నీవు కాలహరణము చేయుటకు నేనేమి యపరాధ మొనర్చితిని చెప్పవయ్యా? అని శ్రీరామునితో అయ్యగారు వాదు చేయుచున్నారు.

ఆభోగి రాగలక్షణము:—ఔడవరాగము. 22-వ మేళము ఖరహరప్రియ జన్యము. పంచమ నిషాదములు వర్జ్యములు. శుద్ధమధ్యమ చతుశ్శ్రుతి దైవతములు రాగచ్ఛాయాస్వరములు; ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

| ఆరోహణము. | అవరోహణము. |
|---|---|
| స రి గ మ ధ సే | సే ధ మ గ రి స. |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. ప. ; | ; | ; | * | రీగా - రీ ; రీ | సా ; - ధా | \| సా - నీ ; మా | \|\| |
| ; | ; | ; | * | నన్ను - బ్రో, వ | నీ ; - కిం | \| త - లా ; ము | \|\| |

2. గారీ ; ; * రీగా - గరిరీ - రీ | ,, | సా - రీమగగా ||
సమా ; ; * నన్ను - ప్రో. - వ | ,, | త - తా. . మ ||

3. ,, * రీగా - రీమగరీ | ,, | సా - ధసరిగమా ||
,, * నన్ను - బ్రోవ | ,, | త - తా. . మ ||

4. గాగరిరీ * రీగా - గరిరిరీ | సరిగగరిస - ధా. | ,, ||
సమా. . * నన్ను - బ్రో.వ | నీ . . . . - కిం | ,, ||

5. ,, * ,, | మగగరిరిస - ధా. | ,, ||
,, * ,, | నీ . . . . . - కిం | ,, ||

6. ,, * రిగమా - రిగమాగా | ,, | ,, ||
,, * న. న్ను - బ్రో. వ | ,, | ,, ||

7. ,, * గామా - ధామాగా | ,, | ,, ||
,, * న న్ను - బ్రో . వ | ,, | ,, ||

8 ,, * గామా - దా ; ధా | ధసధసధా - దధ | మా - పగగాగా ||
,, * నాపై - నే ; రి | మే.... - మి. | . - ప . . ల్కు ||

9. గరి ; * గామా - ధా ; సా | ,, | ,, ||
మా. ; * న్నాపై - నే ; ర | ,, | ,, ||

10. ,, * గామాధా ; సా | రిగా ; - రిస | ధా - మా ; గా ||
,, * నాపై నే ; ర | మే. ; - మి. | . - ప ; ల్కు ||

11. ,, * ,, | రిగమగగరి - రిస | ,, ||
,, * ,, | మే . . . . - మి. | ,, ||

,, *
,, * (నన్ను)

అ. ; ; ; * మాధాసా ; రీ | రీ ; ; - గగ | గా - గామగగా ||
; ; ; * చిన్నా ; డే | నీ ; ; - చెలి | మి - గలు గ ||

2. గరిరిససాం * ,, | ,, | ,, ||
గో. . . రి * ,, | ,, | ,, ||

గరిరీ ; * రిగమగ - గరిరిసాం | ధాసాం ; - రీ | గాంరీ - సాంధా ||
గో. రి ; * చిం . . - తిం. . ప | లే దా ; - శ్రీ | . . . - రా . ||

మాగారీ *
మా . . * (నన్ను)

చ. ; ; ; * దాదాదా , ధా | ధసధా ; - ధా | మా - మగగా గా ||
; ; ; * నిజదా ; స | చ , రు ; - ల | గు - ణ . . ముమ్మ ||

2. గరి రీ ; * ,, | ధసధసధా - ధా | ,, ||
ఉ.తో ; * ,, | చ . . . రు - ల | ,, ||

,, * గామాధా ; మా | గాం , రీ , - సా | సాం - ధసరిగమా ||
,, * నీ వుబా ; గు | గా , బు, - ట | గ - లే. . . ||

గామా * మాధ సాం ఠీ | ఠీ; ; - గగ | గాం - గాపగగా ||
, దా * గ జ రా జ | ర ; ; - క. | క - త న . యు ||

గరిరిసాం * ,, | ,, | ,, ||
ల . న. * ,, | ,, | ,, ||

గరిరి ; * రిగపగ - గరిరిసాం | ధాసాం ; - రి | గాంరిసాంధా ||
ల . న ; * క . ని . - పెం. చ | తే గా , - త్యా | గ రా. జ ||

మాగారి *
ను . త * (నన్ను)

అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు మనశ్శుద్ధిలేక మొక్కిపూజలు, జపములు, యజ్ఞములు చేసినను నిష్ఫలమగు ననుచున్నారు.

(52) ఆభోగి - ఆది.

ప. మనసునిల్ప శక్తిలేకపోయిన మధురఘంటవిరుల పూజయేమి చేయును (మ)

అ. ఘనదుర్మదుఁడై తామునిఁగినఁ గావేరి మందాకిని యెటు బ్రోచును (మ)

చ. సోమిదమ్మ సొగసుకాండ్రఁ గోరిన సోమయాజి స్వర్గార్హుఁడౌనో
కామబద్ధుఁడు తపంబొనర్చినఁ గాధి రక్షించునే త్యాగరాజనుత (మ)

ప్రతిపదార్థము.

మనసు - మనస్సును
నిలుపక - భగవంతునియందు నిలుపకను
శక్తి లేకపోయినన్ - శక్తిలేకపోయినచో
మధురఘంట - చక్కఁగ మ్రోయుచున్న మధురఘంటయును
విరులపూజ - పుష్పములచే చేయఁబడిన పూజయును
మున్నగునవి

ఏమిచేయును - ఏమిప్రయోజనము గును
ఘనదుర్మదుఁడై - నిండిన అహంకారముగలవాఁడై
తాన్ మునిఁగినన్ - తాను స్నానము చేసినచో
కావేరి - కావేరియును
మందాకిని-గంగయును (వీనియందుఁ జేయఁబడు స్నానము.
ఎటు బ్రోచును - ఎట్లు కాపాడును

సోమిదమ్మ - సోమయాజి యొక్క భార్య

సొగసు కాండ్రను - చక్కని పెట్ట పురుషులను

కోరినన్ - వలచినచో

సోమయాజి - యాగము చేయువాఁడు

స్వర్గార్హుఁడౌను ఓ - స్వర్గమును బొందఁగలఁడా

త్యాగరాజనుత - త్యాగరాజుచేఁ గొనియాడఁబడు శ్రీరామా

కాపుబద్ధుఁడు - కాపుచేఁ గట్టుపడిన వాఁడు

తపంబు - తపస్సును.

ఒనర్చినన్ - చేసినచో

కాచి రక్షించును ఏ - వాఁడు చేసిన తపము ॥ ౨౨ రక్షించునా ?

విశేషార్థము:—'మనసునిల్ప శక్తి లేకపోయిన... పూజ యేమి చేయును' అనుటచే భగవంతునియందు నిలుకడలేని బుద్ధిగలవాఁడు చేయు పూజలు వ్యర్థమగు నచుచున్నారు. చంచలబుద్ధి గలవాఁడు, 'దృఢపూర్వ శ్రుతో మూర్ఖో ధర్మాణామవిశారదః । వృద్ధానపృచ్ఛన్ సందేహానం ధశ్శ్వభ్రమివర్చతి' అనునటులు ముందు ముందుగవిన్న విషయమునందే పట్టుగలిగినవాఁడై, మూర్ఖుఁడు ధర్మములను చక్కఁగ నెఱుఁగనివాఁడై, పెద్దలయొద్దఁ జేరి తన సందేహములను దీర్చికొనని వాఁడై యుండి, అంధుఁడు పల్లమునందు తానుగనే పోయి పడునటులు చెడిపోవును. 'అవ్యవస్థిత

చిత్తస్య ప్రసాదోఽపి భయంకరః' అనునటులు, స్థిరచిత్తము లేనివాని యనుగ్రహమును భయంకర మైనదియై యుండినచో వీనికి శాంతి యెట్లు గలుగును. శాంతిలేని మనస్సుగలవాఁడు పెద్ద ఘంటలను వాయించి మంచి పుష్పములచే పూజ లొనర్చినను ప్రయోజనమేమి? యేమియు లేదనిభావము.

'ఘనదుర్మదుఁడై...ప్రోచును' అనటచే పూజలు మాత్రమేగాక పుణ్యతీర్థ స్నానముచు మమకారము గలిగిన వానియెడల అప్రయోజక మనుచున్నారు. అనఁగా, దుర్మదుఁడై యుండు వాఁడు, తాను పరమ అల్పుఁడుగ నుండియు, 'ఈశ్వరోఽహ మహం భోగీ' అనునటులు తానే ఈశ్వరుఁడనియు, పరమ సుఖము ననుభవించువాఁడని తలంపు గలవాఁడుగను, 'మూర్ఖాశ్చ పండితం మన్యా అధర్మా ధార్మికా ఇవ। ధర్మయుక్తాన్ ప్రబాధంతే సాధూనాం లింగమాస్థితాః' అనునటులు మూఢుఁడుగ నుండు తన్ను పండితుఁడుగ నెంచుకొని పెద్దలవలె వేషము వేసికొని పెద్దలను బాధించు వాఁడుగను నున్నవాఁడు. మఱియు, 'అతిమానోఽతివాదశ్చ తథాఽత్యాశా నరాధిప। క్రోధశ్చాతివివిస్తాచ మిత్రద్రోహశ్చతానిషట్॥ ఏత ఏవాసయస్తీక్ష్ణాః కృన్తన్త్యాయూంషి దేహినామ్। ఏతాని మానవాన్ ఘ్నంతి న మృత్యుర్భద్రమస్తుతే' అనఁగా, గర్వము, అతివాదము, అత్యాశ, కోపము,

అతి సందేహము, మిత్రద్రోహము అను నీయాఱు నను పదునుగల కత్తులుగ నుండి మనుజునికోసి చంపుచున్న వేగాని యముఁడు చంపుటలేదని భావము. ఇట్టి అహంకారమును పదునుగల కత్తిని కరఁగఁ గొట్టుటకు జ్ఞానమను అగ్ని కావలసి యుండఁగ కావేరియందును గంగయందును గల నీరు ఏమి చేయునని భావము.

'సామిదమ్మ...త్యాగరాజనుత' అనుటచే, సహధర్మచారిగ నుండు భార్య దుష్టస్వాంగత్యము గలదియై యుండునేని భర్త చేయునట్టి యాగాది కర్మములు నిష్ప్రయోజనమై పోవుననియు, ధర్మమునకు విరోధిగ నుండు కామముల ననుభవించుటయందాశగలిగి, 'కామాత్ క్రోధోభిజాయతే' అనునటులు, అట్టి ఆశ నెఱవేఱక పోవుటచేఁ గలుగు క్రోధము గలవాఁడై యుండువాఁడు చేయు తపము నిష్ఫలముగనుండు ననుచున్నారు. కనుక కామక్రోధములను త్యజించి మనశ్శుద్ధిగలవాఁడై యుండి చేయు పూజచేతనే భగవంతుఁడు తృప్తి నొందుచున్నాఁడని భావము.

| | | | |
|---|---|---|---|
| చ. సాధామా - గారీసా - రిగమా | గా - రీ సా | సా ; - రి గ॥మా | ‖ |
| మనసు - ని . ల్ప - శ . . | క్తి - లే క | పో ; - యి న | ‖ |

దదధా - ధా ;, మా - దధసా - ధసి | రిగరీ రీ - | సిసిగా - గారీ ||
మధుర - ఘం ; ట - విరుల - పూ | జ. రే మి. | చే. . - యుమ ||

అ. గామాధా ; ; ; - ధసిధసి | ధామా గామా | ధాసా - రీరీ ||
ఘ నదు ; ; ; - ర్మన్ము. | హై . తా . | ము ని - గిన ||

గారీ - సిరిగారీ - ధసా - రిగా | గారీగా రీ | రిగమగ - గరిరీ ||
శా. - వే. . రి - మం. - దా. | కి నియొటు | ప్రో. . - చు.ను ||

చ. మా ; - ధామా ; గా - రీగా | మా - ధాసా - ధా | మా ; - గారీ ||
సో , - మిద ; మ్మ- సొగ | సు - కాం. - డ | గో ; - రి న ||

రీ , గ - గరి రీసా - ధ్సాసా - | రిగమగ - గరిరిస | రీగా - మా ; ||
సో; మ - యా. జి - స్వ . - | గ్గా. . - ర్వా. . | జా. - నో ; ||

గా ; మా ; ధా ; - ధాసా | ధామా ; - ధా | సా.; - రీరీ ||
శా ; మ ; బ ; - ద్దు డు | త పం ; - బొ | న ; - ర్చిన ||

| గాం ; రీ . సరిగరి - ధాసాం రీ | గాం - గా రీ | రిగమగ - గారీ || |
|---|---|---|
| గా ; చి . ర . . . . - క్షిం. చు | నే - త్యా గ | రా. జ . - ను త || |

అవతారిక:— ఈ కీర్తనయం దయ్యగారు, జీవుని యందును భగవంతుని యందును, జీవుని రక్షించుటకై యుండు అనేక కారణములలో ముఖ్యమైన సదాచార్య సంబంధమును ప్రకటించుచు ఆచార్య పురుషకారమును ప్రార్థించుచున్నారు

(53) సిద్ధసేన - ఆది.

ప. ఎవరైన లేరా పెద్దలు - ఇలలోన దీనులఁ బ్రోవను (ఎ)

అ. భవకాననమ్మునఁ జరించు - బలుగాసి రామునితోఁ దెలుప (నె)

చ. కలిమానవాధముల కార్యముల్ - కామమత్సరాదుల కృత్యముల్
ఛలచిత్తములేని వారిపుడు చాలఁ ద్యాగరాజుతోడఁ దెల్ప (నె)

## ప్రతిపదార్థము.

ఇలలోనన్ - భూమియందు
దీనులన్ - నావంటి పేద దాసులను
ప్రోవన్ - కాపాడుటకు
పెద్దలు - సత్పురుషులు
ఎవరు ఐనన్ లేరా - ఎవ్వరును లేరా
భవకాననమ్మునన్ - సంసారమనెడి అడవియందు
చరించు - సంచరించుటచే కలుగు
బలుగాసి - మిక్కిలి ఆయాసమును
రాజునితోన్ - శ్రీరామునితోడ
తెలుపన్ - తెలియజెప్పుటకు
(ఎవరైన లేరా)
'కలి...కార్యముల్',
కలి - ఈకలియుగమునందు
మానవాధముల - నీచమనుష్యులు చేయునట్టి
కార్యముల్ - కార్యములను
'కామ...కృత్యముల్'
కామ - ఆశచేతను
మత్సరాగల కృత్యముల్ - మాత్సర్యము మున్నగు వాని
చేతను చేయబడు కార్యములను
ఘనచిత్తము - వెనుదీయునట్టి చిత్తవృత్తియును
లేనివారు - లేక యుండువారు
ఇప్రడు - ఈసమయమున
చాలన్ - మెండుగ
త్యాగరాజుతోన్ తెలుపన్ - త్యాగరాజుతో తెలియ
బఱచుటకు
(ఎవరైన లేరా)

విశేషార్థము:—చేతనుఁడు భాగవత పురుషకారము లేక భగవత్ప్రసాదమును బడయుట దుర్లభము. పురుషకార విశేషముచేత భగవంతుఁడు మహాపరాధినిఁగూడ రక్షించుచున్నాఁడు. మహాపరాధియైన కాకాసురుని విషయములో, పరమకారుణికయైన సీతాదేవి తనకు వాఁడు చేసిన అపరాధమునుగూడ మఱచి పురుషకార మొనర్చినందువలన 'సపిత్రా చ పరిత్యక్తస్సురైశ్చ సమహర్షిభిః । త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణంగతః ॥, వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్ ॥' అనునట్లు బ్రహ్మ మున్నగు దేవతలచేతను, మహర్షులచేతను త్యజింపఁబడినవాఁడై ముల్లోకములను దిరిగి అతిదీనుఁడై రాముని శరణువొచ్చిన కాకాసురుఁడు వధార్హుఁడై యుండియు కాపాడఁబడిన ప్రాణముగల వాఁడాయెను. లక్ష్మీ పురుషకారమువలెనే యాచార్య పురుషకారమును బలిష్ఠమైనది గనుకను, అయ్యగారు 'ఆచార్యస్య ప్రసాదేన మమ సర్వమభీప్సితమ్ । ప్రాప్స్యామితి యస్యాస్తి విశ్వాసస్స సుఖీ భవేత్' అనునటులు ఆచార్యుఁడే అన్ని యభీష్టములను నెఱవేర్చువాఁడను నమ్మిక గల వారగుటచేతను, 'కలిమానవాధమ కార్యములు... లేనివారు' ఇత్యాదులచే, 'ఆచార్యో వేద సంపన్నో విష్ణుభక్తో విమత్సరః । మంత్రజ్ఞో మంత్ర భక్తశ్చ సదా

మంత్రాశ్రయశ్శుచిః॥ గురుభక్తి సమాయుక్తః పురాణజ్ఞో విశేషతః । ఏవం లక్షణ సంపన్నో గురు రిత్యభిధీయతే' అనునటులు వేదాధ్యయనము చేసినవాఁడుగను విష్ణుభక్తి గలవాఁడుగను, ద్వేషబుద్ధి లేని వాఁడుగను, భవతారక మంత్రము నెఱిఁగినవాఁడుగను, అందు భక్తిగలవాఁడుగను, పరిశుద్ధుఁడుగను, గురుభక్తి గలవాఁడుగను, పురాణములయందు పరిచయముగలవాఁడుగను నుండు ఆచార్యుఁ డెవఁడైనను, ఈ కలియుగమునందు సంసారమను అడవియందు దిక్కులేక పరితపించువారి కష్టములను శ్రీరామునికిఁ దెలిపియు, అయ్యగారివంటి భక్తులకు భగవత్సాయుజ్యమును బడయుటకైన మార్గమును తెలిపియు పురుషకార మొనర్చుటకులేరా? అని సదాచార్య ప్రసాదమునకై ప్రార్థించుచున్నారని భావము.

సిద్ధసేనా రాగలక్షణము:—ఇది వక్రసంపూర్ణరాగము, 22-వ మేళము. ఖరహరప్రియ జన్యము. చతుశ్శ్రుతి ధైవత సాధారణ గాంధారములు రాగచ్ఛాయాస్వరములు. ఎల్లప్పుడు గానము సేయఁదగినది.

ఆరోహణము.

స గ రి గ మ ప ధ సా.

అవరోహణము.

సా ని ధ మ ప మ రి గ రి స.

స, ; ; ; * పాపాపా ; పా | ధా , మా ; - ధ ప | పా - నిదనిపపా ||
; ; ; * క లిమా ; న | వా , . ; - ధ ను | ల - కా. . స్య ||

మరిగగరి * సగరి - సనిధా సా | గ రి గా ; - గా | మా - ధామాగా ||
ముల్.. * కాప - వ. . త్స | రా. . ; - ను | ల - కృ . త్య ||

మరిగరీ * పాధాసా , గరి | రిగమా , రి - గా | రిసా ; నీ ||
ముల్.. * ఫలచి ; త్త. | ము . , . - లే | నిహా , రి ||

ధా , మా , * మాధాసా ; సా | ధసనీ ; - ధా | మా - పా ; మా ||
పు , డు , * చాల త్యా; గ | రా . ; - జు | - తో , నె ||

రిగరిసనిధ *
ఉప... * (ఎవరైన)

అవతారిక:—ఈ కీర్తనమునందు దయ్యాగారు, తమకు మరల జన్మయున్నదని తెలిపిన రాముని తో, శ్రీరామా! ఇంతవఱకు నన్ను కాపాడి యిప్పుడు నన్ను విడనాడఁగూడదని వినయపూర్వకముగ ప్రార్థించుచున్నారు.

(54) మంజరి - ఆది

ప. పట్టి విడువరాదు నా చెయి పట్టి విడువ రాదు (పట్టి)

అ. పుట్టిననాఁడే నిజభక్తిని మెడఁ - గట్టి గుట్టు చెదరక ప్రోచి చెయి (పట్టి)

చ. నిత్యానిత్యములను బోధించి - కృత్యాకృత్యములను దెలిపించి
ప్రత్యక్షుఁడు నీవని కనిపించి - భృత్యుఁడైన త్యాగరాజు చెయి (పట్టి)

ప్రతిపదార్థము.

(శ్రీరామా)
నా చెయి - నాదు హస్తమును
పట్టి విడువరాదు - ఒకసారి గ్రహించి మరల విడిచి [పెట్టరాదు
పుట్టిన నాఁడు ఏ - జన్మమెత్తిన దినమునందే
నిజభక్తినిన్ - నిశ్చయమైన భక్తిని
మెడన్ కట్టి - నా మెడకు కట్టి

గుట్టు చెదరక - గౌరవము కాపాడి యుంచి
ప్రోచితివి - కాపాడితివి
(పట్టి విడువరాదు)
నిత్య అనిత్యములను - స్థిరా స్థిరములను
బోధించి - నా కుపదేశించి
కృత్య అకృత్యములను - చేయఁదగినవియు చేయఁ
దగనివియు నగు కార్యములను

తెలిపించి - నా కెఱుకపఱచి
ప్రత్యక్షుఁడు-మాయా సంబంధము లేని విరాట్స్వరూపుఁడు
నీవు అని - నీవే యని
కనిపించి - నాకు గోచరమగునట్లు చేసి
భృత్యుఁడైన - నీదు దాసుఁడైన
త్యాగరాజు చెయి - ఈ త్యాగరాజు కరమును
(పట్టి విడువరాదు)

విశేషార్థము:—అయ్యగారికి ఒక సమయంబున శ్రీరాముఁడు ప్రత్యక్షుమై పరీక్షార్థముగ, త్యాగరాజా! నీవు నాదు భక్తుఁడవేను, అయినను నీకు మఱియొకజన్మము గలదని చెప్పి మఱుఁగుఁ జెందెను. ఆ సమయమునందుఁ బాడిన కీర్తనములలో నిదియొకటి.

'పట్టి విడువరాద...ప్రోచి చెయిపట్టి విడువరాదు' అనుటచే, శ్రీరామా! వెనుక నొక సమయంబున గర్భమునందున్న సమయంబుననే ప్రహ్లాదునికి నీదు భక్తిని నారదుని ...ముగఁ

గలుగఁజేసి వానిని హిరణ్యకశిపుచేత నన్ని బాధలఁ బెట్టించి తుదకు నారసింహమై యవతరించి ప్రహ్లాదుని బాధలను తొలఁగించితివి. ఆ సమయమునందును, 'వత్స ప్రహ్లాద భద్రం తే ప్రీతోఽహం తేఽసురోత్తమ । వరంవృణీష్వాభి మతం కామ పూరోఽస్మ్యహం నృణామ్' అని ప్రహ్లాదునకు మోక్షమీయక వరములిచ్చి యేమార్చుటకై ప్రయత్నముచేసి వానిని వరము లడుగుమని చెప్పితివి. అటులే ఈ రామావతారమునందు నాకు జన్మమూదిగ నీకు భక్తినిఁ గలుగఁజేసి, ఈ యెనుబదియెనుబది సంవత్సరములవఱకును కాపాడి, నాకు అంత్యకాలము సంభవించిన యీ సమయమున మఱియొక జన్మ మున్నదని చెప్పుచున్నావు. ఇట్లు నీదాసులను అంత్యకాలమున విడనాడుట న్యాయము కాదనుచున్నారు.

'నిత్యానిత్యములను...త్యాగరాజు చెయి పట్టి విడువరాదు' అనుటచే, శ్రీరామా ! లోకములందుఁ గలుగు సుఖములన్నియు నస్థిరమైనవనియును, 'నచ పునరావర్తతే' అనునటులు, పుట్టుచావు లేనిదియు నిత్య సుఖ ప్రదమైనదియు నగు నీదు పదమే స్థిరమైనదనియును నా కెఱుక పఱచితివి ; చేయఁదగిన కార్యము నీదు కైంకర్యములనియును, తదితర కార్యములు చేయఁదగనివనియును తెలిపి

తివి. మానుష విగ్రహాంగ ఉండియును, 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' ఇత్యాదులచే నీవు మాయా సంబంధమేమియు లేక ప్రత్యేకముగ నుండు విరాట్ స్వరూపుఁడవు అనియును, 'యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ప్రయంత్యభి సంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ। తత్ బ్రహ్మేతి' అనునటుల సృష్టి స్థితిలయ కారణ భూతుండైన పరబ్రహ్మ స్వరూపుఁడవనియు నా కెఱుక పఱచితివి. 'మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే' అనునటులు నిన్నే భజించువాఁడు జనన మరణ దుఃఖమునుండి తొలఁగుచున్నాఁడనియు తెలిపితివి. 'శంకరస్య తు యో భక్తః సప్త జన్మాంతరం నరః। తస్యైవ తు ప్రసాదేన విష్ణుభక్తః ప్రజాయతే ॥ త్రిభిః ప్రజాపతేర్భక్తః సప్తభిః శంకరస్య తు। వింశత్యాఽగ్నీంద్ర సూర్యాదేర్విష్ణు భక్తః ప్రజాయతే' అనునటులు, ఏడు జన్మములయందు శంకరభక్తుఁడుగ నుండువాఁడు ఆ శంకర ప్రసాదమువలన ఎనిమిదవ జన్మమున విష్ణుభక్తుఁడుగఁ బుట్టును అనియు, మూఁడు జన్మములయందు బ్రహ్మకు భక్తుఁడుగ నుండువాఁడును, ఏడు జన్మములకు శివ భక్తుఁడుగ నుండువాఁడును, ఇరువది జన్మములకు అగ్నియు, సూర్యుఁడు, ఇంద్రుఁడు మున్నగు వారలకు భక్తుఁడుగ నుండువాఁడును వి

భక్తుఁడుగఁ బుట్టుచున్నాఁడనియును, 'నాన్యం దేవ ముపాసీత విష్ణోః పరమ కారణాత్ । మాయామ ముత్తర్తుకామో వై మాయాయా దేవతాగణః । నచాన్యజ్ఞాన కర్మభ్యాం నాన్యభక్త్యా పరం పదమ్ । ప్రాప్నోతి పురుష స్తస్మాత్ తమేవ శరణం వ్రజేత్' అనునటులు, ప్రకృతిని దాఁటుటకు ప్రయత్నించువాఁడు మూలకారణుఁడుగ నుండు విష్ణుమూర్తినే శరణుపొందవలయును, తదితరములై యుండు ఎట్టి కార్యముచేతను ప్రకృతిని దాఁటుటకు సాధ్యము కాదనియును చెప్పఁబడియున్నవి. నీ వన్ననో, 'శ్రుతి స్స్మృతిర్మమై వాజ్ఞా' అనునటులు శ్రుతియును స్మృతులును నీమ అజ్ఞారూపములని చెప్పియున్నావు, ఈ కారణములచేత నే నితరభక్తిని చేయక నీమ భక్తిని సలుపుచున్నాను. ఇట్టి నాకు మఱియొక జన్మమున్నది యనుట అన్యాయమేగదా? నన్ను నీమ భక్తుఁనిగ స్వీకరించి మఱియు విడనాడుట సరికాదు. దయగలిగి కాపాడుమనుచున్నారని భావము.

మంజరి రాగలక్షణము:—ఇది వక్ర సంపూర్ణ రాగము 22-వ మేళమునందుఁ బుట్టినది. ఆరోహణమునందు ధైవతము వక్రము. శుద్ధ మధ్యమ కైశికీ నిషాదములు రాగచ్ఛాయా స్వరములు, ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

ఆరోహణము.

స రి గ మ ష ని ధ ని స.

అవరోహణము.

స ని ధ ప మ గ రి స.

ప. ; * సాగారీ - గాగామాగా | మా - ; ; ; | పా ; నిధనీ ||
; * ప ట్టి వి - డు వ రా. |. దు - ; ; ; | నా ; చెయి ||

2. ; * నిదధపమా - మగగా - గరీ | సా - , , ; | మగగా - గ రిరిస ||
; * ప ట్టి. వి - డు. వ - రా. | దు - ; ; ; | నా. . - చెయి. ||

3. సన్ని * . సాగారి - గాగామాగా | మా - ; , ; | పానిని - ధనిసా ||
.. * ప ట్టి వి - డు వ రా. | దు - ; ; ; | నా . . - చెయి. ||

4. ; * నిసధపమా - మగగా - గరిరీ | సా - ; ; ; | పమమా - మగగరి ||
; * ప. ట్టి. వి - డు. వ - రా. | ద్దు - ; ; ; | నా. . - చెయి. ||

5. సన్ని * సాగాగా - రిగా - గరిరీ | సా - , ; ; | రి గా - గరిసన్ని ||
.. * ప ట్టి వి - డువ - రా. | దు - ; , ; | నా. - చెయి ||

6. ; * సా గారీ - గాగామగగరి | స్గా , , - గగ | రిగ,గా - మగగరి ||
; * ప ట్టివి - డు వ రా . . | దు ; , - . . | నా . - చెయి. ||

7. సని * సగగాగా - గాగా - మగరిస | నీ ; ; - గగ | ,, ||
. . * ప . ట్టి వి - డు వ - రా. . . | దు ; ; - . . | ,, ||

8. ; * సాగారీ - గాగా - మగగా - | పమమా - ధపపా | పానిని - ధనిసా ||
; * ప ట్టివి - డు వ - రా, . - | దు. . - . . . | నా . . - చెయి. ||

9. ; * నిదధపమా - మగగా - గరిరీ | సా ; - సా ; | నిధపప - మగగరి ||
; * ప. ట్టి. వి - డు. వ - రా. | దు ; - . ; | నా . . - చెయి. ||

10. సని * సాగారీ - గాగామాగా | మా ; ; ; | గమగా ; ; ||
. . * ప ట్టి వి - డు వ రా . | దు ; ; ; | . . . ; ; ||

రి ; ; ; - రీసాన్నీసా | ; ; - ; ; | ; ; - ; ; ||
. ; ; ; - . . . . | ; ; - ; ; | ; ; - ; ; ||

అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరామా! ధర్మార్థకామములనుగాని, నీకు సారూప్యమును గాని నే నాశింపలేదు. నీకు పాదసేవను మాత్రమే కోరియున్నానని భగవత్ కైంకర్యమును యాచించుచున్నారు.

(55) పూర్ణషడ్జము - ఆది.

ప. శ్రీమానినీమనోహర - చిరకాలముగ మాట యొకటేరా
శ్రీమానినీమనోహర - వేమాఱుఁ బల్కఁజాలరా (శ్రీ)

అ. శ్రీమంతులౌ నీసోదరులు - సేయునీతిఁ బాదసేవఁ గోరితిని (శ్రీ)

చ. ధర్మాద్యఖిల పురుషార్థములు - దాశార్థ్ని రూపమబ్బిన
మర్మంబు వేఁడేయున్నది - మన్నింపు మిఁకఁ త్యాగరాజనుత (శ్రీ)

ప్రతిపదార్థము.

శ్రీమానినీమనోహర - లక్ష్మీవల్లభుఁడా
చిరకాలముగన్ - చాలకాలముగను
మాట - నాదుమాట
ఒకటేరా - ఒక్కటియేరా

వేమాఱుఁ - పలుమాఱులు

పల్కఁ - పలుకుటకు

చాలఁరా - శక్తుఁడను గానురా

శ్రీమంతులు ఔ - సంపద్యుక్తులై

నీ సోదరులు - నీ తమ్ములు

చేయురీతిఁ - చేయునట్లు

పాదసేవఁ - చరణసేవను

కోరితిని - ఆసగొంటిని

(శ్రీమానినీ)

ధర్మాద్యఖిల పురుషార్థములు - ధర్మము, అర్థము, కామము అను మూఁడు పురుషార్థములును

దాశార్హుని - భక్తులచేయునాత్మ సమర్పణమున కర్హుఁడైన భగవంతుని; లేక భక్తులకొఱకు తనయాత్మనైన నియ్యఁదగినవాఁడైన భగవంతుని

రూపము - సారూప్యము

అబ్బినఁ - లభించినను

మర్మంబు - అంతలోని రహస్యంబు

వేఁచియున్నది - వేఱుగ నున్నది

త్యాగరాజనుత- త్యాగరాజుచేఁ గొనియాడఁబడిన రామా

ఇఁకఁ - ఇఁకను

మన్నింపుము - రక్షింపుము

విశేషార్థము:—చేతనునికి అన్నిటికన్న శ్రేష్ఠమైనది భగవత్ కైంకర్యము. ఆ కైంకర్యము లభించుటకు జన్మాంతరభాగ్యము కావలయును. అందును భగవంతుని కత్యంత ప్రియముతోఁ బక్కనుండి కైంకర్యవ చేయునట్టి భాగ్యము లభించుట మిగుల కష్టము. అట్టి గొప్ప కైంకర్యము

లనే యాచించునపుడు అందుకుఁ దగిన పురుషకారము కావలయును. కనుకనే, అయ్యగారు, ఈ కీర్తనమునందు, 'శ్రీమానినీ మనోహరా' అను ప్రయోగముచే పురుషకారములో శ్రేష్ఠమైన లక్ష్మి పురుషకారమును ముందు పెట్టుకొని రామకైంకర్యము ను యాచించుచున్నారు. అనఁగా, శ్రీరాముని వనగమన సమయమున వాని కైంకర్యమునం దత్యంతప్రీతి గలిగియుండు లక్ష్మణుఁడు వనమునందును కైంకర్యముచేయుటకై శ్రీరామునితో వనగమనము చేయఁదలఁచి ఆభాగ్యము తనకు లభించునో లభింపదో అను సందేహముగలవాఁడై, 'స భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః। సీతాముహాచాతియశా రాఘవంచ మహావ్రతమ్' అనునటులు, శ్రీరాముని పాదములను గట్టిగఁ బట్టుకొని సీతాదేవితో తన యభీష్టమును తెలిపి పురుషకారము చేయవలయునని ప్రార్థించెను. అయ్యగారు కోరిన కైంకర్యమును అటువంటిదే గనుక సీతాదేవిని పురుషకారము చేయుమను చున్నారని భావము.

'చిరకాలముగ మాట యొకటేరా' అనుటచే, 'రామో ద్విర్నాభిభాషతే' అని శ్రీరాముఁడు రెండు మాటలాడువాఁడుకాఁడు. అటులనే వాని దాసుఁడైన అయ్యగారును, శ్రీరామా!

నేను చెప్పినది చెప్పినదియే. మఱియొకమాట చెప్పలేను. నేను కే ట్టుగ నీ పాదసేవనే కావ లయునను చున్నారని భావము.

'శ్రీమంతు లౌ నీ సోదరులు...పాదసేవఁ గోరితి' అనుటచే, ఋష్యమూక పర్వతమునందు సుగ్రీవుఁడు జానకియొక్క ఆభరణములను శ్రీరాముని ముందుగఁ బెట్టినపుడు, శ్రీరాముఁడు ఆసొమ్ముల నెఱుఁగుదువా ? అని అడిగినందుకు లక్ష్మణుఁడు, 'నాహం జానామి కేయూరే నాహం జానామి కంకణే । నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్' అనఁగా, 'అన్నా ! నేను కేయూర ములనుగాని కంకణములనుగాని చూచినది లేదు; నిత్యమును పాదసేవ చేయుటచే నీ నూపురమును మాత్ర మెఱుంగుదునని చెప్పి పాదసేవా ప్రభావమును ప్రకటింపఁ జేసెను. అట్టి కైంకర్యము తమకు లభించవలయునని అయ్యగారు ప్రార్థించుచున్నారని భావము.

'ధర్మాద్యఖిల పురుషార్థములు...మన్నింపు మిఁక' అనుటచే పురుషార్థములుగాని, సారూప్య సాయుజ్యములుగాని, పదవిచే పరము ఉచ్చమైనది యైనను భగవత్ కైంకర్యమునకు విరోధముగ

నున్నది కనుక అట్టి పదములు తనకు నిచ్చినను వలదనుచున్నారు. 'మన్నింపు మిఁక' అనుటచే, శ్రీరామా! నే నొకటి యడిగిన నీ వొకటి ఇచ్చి నన్ను మోసపుచ్చుటకు చూచెదవా! ఈ రహస్యములన్నియు నాకు తెలియును. మన్నించవలయును; నే నడిగినట్టుగ నీ పాదసేవ నిమ్ము. అనుచున్నారని భావము.

పూర్ణషడ్జ రాగలక్షణము:—80-వ పుటలో జూడుఁడు

|  |  |  |  |  |  |  |  |  |  |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ప. | ; | ; | ; | * | రీగామా ; గా | \| రీ ; ; - సా | \| ; గారీగా | ‖ |
|  | ; | ; | ; | * | శ్రీ . మా ; ని | \| నీ ; ; - మ | \| ; నో. హ | ‖ |
|  | మా | ; | ; | * | ,, | \| మగగరిరీ - సా | \| ,, | ‖ |
|  | రా | ; | ; | * | ,, | \| నీ . . . . - మ | \| ,, | ‖ |
|  |  | ,, |  | * | రీగా మాపమ మాగా | \| ,, | \| ,, | ‖ |
|  |  | ,, |  | * | శ్రీ. మా. . . ని | \| ,, | \| ,, | ‖ |

అ. ; ; ; * నీ ; సాం ; రీ | రీ ; ; – రీ | గా – మా ; గా ||
; ; ; * శ్రీ ; మం ; తు | లా ; ; – నీ | . – సా ; ద ||

గా , రీ , * రీసనీసాం ; రీ | రీ ; ; – రీ | గా – మాపమమా గా ||
ర , లు , * శ్రీ . . మం; తు | లా ; ; – నీ | . – సా . . . ద ||

మగగరిరీ * సాంనీపా ; మా | నీ , నీ , – సాం | నీపామాగా ||
ర . . లు. * సేయుచీ ; తి | పా, ద , – సే | వకో , రి ||

రిగమగరిస *
తి . . ని . . * (శ్రీమానినీ)

చ. ; ; ; * పా ; పా ; మా | నీ , నీ , – సాం | నీపామాగా ||
; ; ; * ధ ; రాత్మ; ద్య | ఖి , ల , – పు | రుషా . ర్థ ||

మగగరిరీ * గామానీ ; పా | మగగరిరీ – నీ | పాగా ; గా ||
ము.లు.. * దా . శా; ద్రా | ని . . . . – రూ | ప మ ; బ్ధి ||

| | | | |
|---|---|---|---|
| మా ; ; ॥ నీ ; సా ; రీ | రీ ; ; - రి గ | మా గా ; గా | ॥ |
| న ; ; ॥ మ; ర్మం ; బు | వే ; ; - తే. | . యు; న్న | ॥ |
| గ రి రీ ; ॥ సానిపా ; మా | నీ , నీ , - సా | నీపా ; మా | ॥ |
| ది . . ; ॥ మ . న్నిం; ప్ర | మి , క , - త్యా | గరా ; జ | ॥ |

రి గమగరిస
ను. త ... (శ్రీమా)

అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరామా! చిఱుతప్రాయమునాఁడే నా చెయి పట్టి నన్ను రక్షించెదనని చెప్పిన నీవు ఇపుడేమో ముందువెనుకఁ జూచుచున్నావే! ఇది నీకు గొప్పతనమునకు తగునా? గుట్టు విడువక ప్రోవుము చున్నారు.

## (56) కళానిధి - ఆది

ప. చిన్ననాఁడే నా - చెయి పట్టితివే (చిన్న)

అ. ఎన్నరాని యుపాడిగము గైకొని - యెంతో నన్ను పాలనము చేతునని (చిన్న)

చ. ఇట్టి వేళ విడనాడుదమనియో - ఏలుకొందమనియో ఎంచినావు తెలియ

గట్టు(బోవవే సుగుణ వారినిధి - గొప్పదైవమా త్యాగరాజనుత (చిన్న

ప్రతిపదార్థము.

(శ్రీరామా)

చిన్ననాఁడే - చిఱుతప్రాయమునాఁడే

నా చెయి - నాదు కరమును

పట్టితివి ఏ - పట్టితివిగదా

ఎన్నరాని - ఎన్నుటకు సాధ్యముకాని

ఉపాడిగము - పరిచర్యలను

గైకొని - చేకొని

ఎంతో - ఎంతో చక్కఁగ

నన్నున్ - నన్ను

పాలనముచేతునని - పాలించెదనని

(చిన్ననాఁడే నాచెయి పట్టితివే)

ఇట్టివేళన్ - ఈ సమయమునందు

విడనాడుద మనియో - విడిచి పెట్టుద మనియో

ఏలుకొందమనియో - రక్షించుదమనియో

ఎంచినావు - తలంచియున్నావు
తెలియఁజా - (అవిషయము) నా కెఱుకలేదు
సుగుణ వారినిధి - మంచిగుణముల సముద్రమా
గొప్పదైవమా - సర్వేశ్వరుఁడా

త్యాగరాజ నుత - త్యాగరాజుచే నుతింపఁబడువాఁడా
గుట్టు బ్రోవవే - గోప్యముగఁ బ్రోవవే
(చిన్న నాఁడే)

విశేషార్థము:—'చిన్న నాఁడే నా చె పట్టితివి' అనుటచే, శ్రీరామా! మూలప్రకృతి యందు మఱుఁగున దద్దఁబడిన స్వర్ణరేణువును బోలి యుండిన ఈ నాలోని జీవునికి ఉత్తమమైన మానవ శరీరము నిచ్చి నేను బాల్యమునందే యకాల మరణము నొందకుండ నన్ను కాపాడినందున నీవు చిన్ననాఁడే నాకు చేయి యిచ్చి కాపాడినవాఁడవైతివి అనుచున్నారు.

'ఎన్నరాని యూడిగము గైకొని ఎంతో నన్ను పాలనము సేతునని' అనుటచే, శ్రీరామా! బాల్యావస్థను గడపించి బ్రహ్మము నెఱుఁగుటకైన జ్ఞానము నిచ్చి భక్తిమార్గమును తెలిపి నీయందు ఆశను గలిగించి, 'అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే । తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్' అనునటుల, ఇతర విషయములందు చింత లేక

నీయందే భక్తి సలుపువారి యోగక్షేమములను నీవే వహించుచున్నావనియు నా కెఱుక. అది ఎన్నరాని యూడిగములను సేయుచుని వానిని చేకొంటివి. నీవు నన్ను రక్షింతువనియే దిట్టముగ నమ్మియుంటిని. ఇపుడు నీ నడవడికలను గమనింపఁగా నేమో సందేహముగ నున్నది. ఈ త్యాగ రాజును కాపాడుదమా లేక వదలిపెట్టుదమా? అని యెంచినావేమో? వెనుక నొక పర్యాయము నీవు నీ పరమాంతరంగభక్తురాలగు సీతాదేవినే విడనాడి అడవిపాలుచేసితివి. మా తల్లి యగు సీతా దేవి పూర్ణగర్భిణియై యుండునపుడు ఆమెను వేయివిధముల సంతోషపఱచి, ఆమె మనోరథము నడిగి, గంగాతీరమునందు ఋషిపత్నులతో మఱియొక పర్యాయము భక్ష్యము భుజింపవలయు ననిన సీతకు, అటులే చేసెదను; అని నమ్మిక నిచ్చి, మరుదినమునందే మూఢులు గల్పించిన అప నిందకై భయపడినవానివలె నటించి లక్ష్మణునిపిలిచి, 'ఇంతిపై నింత మూర్ఖత్వమేలయనకు। అవ నిజము నాకుఁ దీరె ఋణానుబంధ। మఱియు కాదేని జనులిట్టు లాడుకొందు। రయ్యొ యింకనేల పలుమాటలాడుకొనఁగ' అని లక్ష్మణుని ఏమియు నోరెత్తనీకుండ చేసి, విషయ మిట్టిదని సీతకును తెలుపకయే మోసపుచ్చి, లక్ష్మణునిచే ఆమెకు అబద్ధము చెప్పించి అరణ్యమునందు వదలిపెటు

మని చెప్పినవాఁడవుగదా? అట్టివాఁడు నన్నెందుకు ఉదాసపుచ్చెవు? అను శంక గలుగు చున్నది. ఇప్పుడును అట్లుచేయక భక్తులకును నీకు నుండు సంబంధమును చక్కఁగ గమనించి నీదు సుగుణసంపదచే నీవు భక్తులను గుట్టుగ కాపాడుము. అని అయ్యగారు ప్రార్థించుచున్నారని భావము.

కళానిధి రాగలక్షణము:—ఇది వక్ర సంపూర్ణ రాగము. 22-వ మేళము ఖరహరప్రియ యందు జన్యము. శుద్ధ మధ్యమ చతుశ్రుతి ధైవతములు రాగ చ్ఛాయా స్వరములు. 'సప' అను ప్రయోగము కొన్ని తావులలో రాగప్రధానంబై యుండును. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

| ఆరోహణము. | అవరోహణము. |
| --- | --- |
| స రి గ మ స ప మ ధ ని సే. | సే ని ధ ప మ గ రి స. |

ప. ; ; ; * సారీ గా ; మా సా ; - పా | , మగా ; మా

; ; ; * చి న్నా నా; డే నా ; - నె , యి ప ; ట్టి

గా , రిసని * ,, | సా , సా మ ధ | నిస - నీ ధప ||
తి , వే.. * ,, | నా , . చెయి | .. - ప ట్టి ||

మగారిసధ *
తి . వే . * (చిన్న

; ; ; * ధానీసా ; నీ | సా ; ; ధని | సానీ ; - సని
; ; ; * ఎన్నరా; ని | యూ, ; డిగి | ముగై ; - కొ.

ధపమపామ * ,, | ,, వది | ధ ప - మధనిస నీ
ని. . . . * ,, | ,, - డిగ | ము. - గై. . . కొ

,, * ,, | ,, - రిగ | మాసా ; - సని
,, * ,, | ,, - శిగ | ము గై ; - కొ.

,, * మాధానీ ; సా | నీ ; ; ధప | మాగా ; పమ
,, * ఎంతోన ; మ్న | పా; ; లన | ముచే ; తు.

| | | | | |
|---|---|---|---|---|
| ,, | * మాధా - నీ ; రిస | నిధనీ : - ధప | మా - గా ; మా | ॥ |
| ,, | * గొప్ప - దై. వ. | మా. ; - త్యా | గ - రా ; జ | ॥ |

గా , రిసని *

ను , త. . * (చిన్ననాడే)



అవతారిక:—ఈకీర్తనమునం దయ్యగారు, శ్రీరామా! ఈ కాలమునందు నేర్పుగలిగిన మనుజులును, నీదు సిద్ధాంతమును తెలిసికొనలేక శ్రీచాకల్యము గలవారలై అధర్మ మార్గము నందే ప్రవర్తించుచున్నారే! అని ఆశ్చర్య మొందుచున్నారు.

(57) ఉదయ రవిచంద్రిక - ఆది.

ప. ఎంతనేర్చిన నెంతచూచిన - నెంతవారలైనఁ గాంత దాసులే (ఎం)

అ. సంతతంబు శ్రీకాంత స్వాంత సి ంతమైన మార్గ చింతలేని (ఎం)

చ. పరహింసా పరభామా పరధన పరమాన వాపవాద
పరజీవనముల కనృతమె - భాషించెదరయ్య త్యాగరాజనుత (ఎం)

ప్రతిపదార్థము.

ఎంత నేర్చినను - ఎంత చదువులు నేర్చినను
ఎంత చూచినను - ఎన్ని విషయములను చూచి యను
భవ మొందినను
ఎంతవారలు అయినను - ఎంతో గొప్పవాడని అని
పించుకొను వారలైనను
కాంతా దాసులే - స్త్రీలకు దాసులుగ నున్నవారలే
సంతతంబు - ఎల్లప్పుడును
'శ్రీకాంత... లేనివారు'
శ్రీకాంత - లక్ష్మీనాథునియొక్క
స్వాంత - మనసునందు

సిద్ధాంతము అయిన - సిద్ధాంతమైన
మార్గ - త్రోవయందు
చింతలేనివారు - విచారము లేనివారు
(ఎంత నేర్చిన)
త్యాగరాజనుత - త్యాగరాజుచేఁ గొనియాడఁబడిన
శ్రీరామా!
పరహింసా - అన్యులను హింసపెట్టుటకును
పరభామా - అన్య స్త్రీలఁ జేకొనుటకును
పరధన - అన్యులసొమ్ము నపహరించుటకును
పరమాన వాపవాద - ఇతరులమీఁద నపనింద మోపుటకును

పరజీవనములకుఁ - ఇతరుల జీవనము చెఱచుటకును
అనృతమే భాషించెదరు - అబద్ధమే చెప్పుచున్నారు

అగయ్యా-అయ్యా
(ఎంత నేర్చిన)

విశేషార్థము:—'ఎంత నేర్చిన...చింత లేని వారు' అనుటచే, భగవంతుని కట్టుదిట్టముల నెఱుఁగక యెన్ని విద్యల నేర్చినను ప్రయోజనము లేదనుచున్నారు. అనఁగా, మనుజుఁడు వేదశాస్త్ర పురాణములయందు మెండు పరిచయము గలవాఁడై యుండిన మాత్రమున ప్రపన్నుఁడు కానేరఁడు. జన్మ సాఫల్యము చేయుటకు ఇంద్రియ నిగ్రహమును భక్తియును సాధనములుగ నున్నవి. ఈ సాధనములను బొందుటకైన మార్గము భగవంతుని ఆజ్ఞారూపమై యుండు శ్రుతి స్మృతులయందు నిదర్శింపఁబడియున్నది. మఱియు, 'మన్మనా భవ మద్భక్తో మామేకం శరణం వ్రజ, మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే, పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః' ఇత్యాది భగవద్వాక్యములచే భగవంతుఁడే సర్వరక్షకుం డనియును, వానియందే శరణాగతి చేయవలయు ననియును వెల్లడి యగుచున్నది. ఇదియే భగవంతునియొక్క స్వాత సిద్ధ ైన మార్గము. భగవద్భక్తి యను నీ మార్గమునందు చింత లేని వా రెంత నేర్చినను నిష్ఫలమై పునని భావము.

'కాంతాదాసులే' అనుటచే, 'విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబుపర్ణాశనాస్తేపి స్త్రీముఖ పంకజం సులలితం దృష్ట్వైవ మోహం గతాః। శాల్యన్నం సఘృతం పయోదధియుతం యే భుంజతే మానవాస్తేషామింద్రియనిగ్రహో యది భవేద్వింధ్యః ప్లవేత్సాగరే' అనునటులు, నీరు, గాలి, ఎండిన ఆకులు మున్నగు వానిని ఆహారముగఁ గొని జితేంద్రియులై, అతుల తపోనియతి నుండు వారలైన, విశ్వామిత్రుఁడు, పరాశరుఁడు మున్నగు ప్రముఖుల మనస్సునే చక్కని స్త్రీరూపము లాగివేయుచున్న దనినచో మృష్టాన్నములను భుజించు మానవుల చంచల చిత్తమెంతమాత్రము ? 'అంగారసదృశీ నారీ ఘృతకుంభసమః పుమాన్। తస్మాన్నారీషు సంసర్గం దూరతః పరివర్జయేత్' అనఁగా, స్త్రీ నిప్పువంటిది, పురుషుఁడు నెయ్యివంటివాఁడు, నిప్పు నేతిని ఎట్లు భక్షించివేయునో అటులే స్త్రీ పురుషుని స్వరూప నాశనము చేసివేయును; ఆ కారణముచేత స్త్రీ సాంగత్యమును పరిత్యజించవలయును. భక్తిమార్గము నెఱుఁగనివాఁడు, వర్జింపఁదగిన ఈ స్త్రీ సాంగత్యమునందే తగులువడి నాశము నొందుచున్నాఁడని భావము.

'పరహింసా...భాషించెదరయ్యా' ఇత్యాదులు, 'పరహింస' 'ఆనృశంస్యం పరోధర్మః' అనఁగా, ఇతరులను హింసపెట్టక యుండుట ధర్మములం దుత్తమమైనదని చెప్పఁబడియున్నది. ఇట్టి ధర్మము ననుసరించనివాఁడు, 'బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రస్సర్వాతిసంధకః' అనునటుల పిల్లియొక్క స్వభావము గలవాఁడై మహా నరకములను బొందుచున్నాఁడు. ఇట్టి పాపహేతువైన పరహింసను చేయుచున్నారే యనుచున్నారు.

'పరమానవాపవాదము...పరభామా'అనుటచే, 'పరరంధ్రేషు జాత్యంధాః పరదారేష్వపుంసకాః। పరీవాదేషు యే మూకాస్తేఽతీవ దయితా మమ' అనఁగా, ఎవఁడు ఇతరుల దోషముల యందు జాత్యంధుఁడో (పుట్టు గ్రుడ్డియో), ఎవఁడు ఇతరుల స్త్రీ విషయమునందు నపుంసకుఁడో, ఎవఁడు ఇతరుల నిందించుటయందు మూగివాఁడో వాఁడు నాకు మిక్కిలి ప్రియమైనవాఁడని భగవంతుఁడు చెప్పియున్నాఁడు. అట్లుండినను పండితు లనిపించుకొనియుండు నీ మూర్ఖులు ఈ అధర్మ కార్యములనే చేయుచున్నారని భావము.

'అన్యధన' అనుటచే, 'ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్। తేన

త్యక్తేన భుంజీథాః మా గృధః కస్యస్విద్ధనం' అని ఈశావాస్యోపనిషత్తులో, ఏ అణువుగాని మహత్తుగాని ఈశ్వరునిచే వ్యాప్తమై వాని సొమ్ముగ నుండుటచే ఒరులసొమ్ము నపహరించుట భగవంతుని సొమ్ము నపహరించిన యటులే యని చెప్పఁబడియున్నది. అట్లుండినను పరధనముల కాసపడి అబద్ధ మాడుచున్నారనుచున్నారు.

'పరజీవనముల కనృతమే భాషించెదరు' అనుటచే, 'రాగాద్యపేతం హృదయం వాగదుష్టానృతాదినా । హింసాదిరహితః కార్యః కేశవారాధనం త్రయమ్' అనఁగా, కళ లేనిహృదయమును, అబద్ధములేనివాక్కును, ఇతరులను హింసపెట్టని శరీరమును భగవంతునికిఁ దృప్తి నొందించునట్టివిగ నున్నవి. అట్లుండినను మనుజుఁడు దురాశచే నితరుల జీవనమును తన లాభార్థముగఁ బోఁగొట్టుటకై అబద్ధములాడి అకార్యమును కార్యముగ చేసికొనుచున్నాఁడే! ఇదియేమి అన్యాయమని అయ్యగారు శ్రీరామునితోఁ దెలిపి ఆశ్చర్యము నొందుచున్నారని భావము.

ఉదయరవిచంద్రిక రాగలక్షణము:— ఔడవరాగము. 22 - వ మేళము ఖరహరప్రియ

జన్యము. ఋషభధైవతములు వర్జ్యము. సాధారణ గాంధార కైశికీ నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

ఆరోహణము. | అవరోహణము.
--- | ---
స గ మ ప ని సీ | సీ ని ప మ గ స.

ప. ; ; ; * సనిసా - గమపామా | పా ; ; - మప | నిప - పమమామా ||
; ; ; * ఎం. త - నే. . ర్చి | న ; ; - నెం. | త. - మా . చి ||

పమగా , స * మపమగసా ; నీ | సా , సా , - గమ | పమ - పనిసీని - పమ ||
న . . , . * నెంత. . వా ; ర | లై , న , - గాం | తా. - దా. . - సు. ||

పమగా , స *
లే. . , . * (ఎంత)

అ. ; ; ; * పానీసాం ; సాం | సీనినీ ; - సాం | గాం - సీగమాంమాం ||
; ; ; * సంతతం ; బు | శ్రీ. . ; - కాం | త - స్వాం. త ||

పమగా ; * పపమగసా నీ సా ,, సా , - పని | సని - పా ; మా ||
సి . . * ద్ధాంత . .మై న మా , గ్గ , - చిం | త. - లే ; ని ||

పమగా , స *
వా. . , * (రెంత నేర్చిన

చ. ; ; * పాపాపా ; మా పామా , - మా | ; మా - మామా ||
; ; * పర హిం ; సా పర ; - భా | ; మా - పర ||

పమగా * మపమగసా ; సా సన్నిస్నీ , - న్నీ | సా - .గమపామా ||
ధ . న * ప . ర .మా ; న వా . ; - ప | . - వా. . . ||

పాపా * పానీసా ; సా సనినీ ; - సా | గా - సగమామా ||
ది . పర జీ . వ న . . ; - యు | ల - కి . న్నా ||

పమగా ; * పపమగసా ; నీ సా , సా , - పని | సనిపా ; మా ||
మే. . * భా . షిం. చె ; ద ర , య్యా, - త్యా | గ .రా ; జ ||

పమగా , సా *
ను. . , త * (ఎంత నేర్చిన)



అవతారిక:— ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరా ! ఆదిపురుషుండవై పరమ పావనత్వ రక్షకత్వమును బడసియుండు నీకు నామీఁద దయగలుగకుండుటకు కారణమేమి ? అను చున్నారు.

## (58) ఫలమంజరి - ఆది.

ప. సనాతన పరమపావన - ఘనాఘనవర్ణ కమలనయన (స)

అ. తనవాఁ డను నభిమానము - దైవమైన నీకేల గల్గదో (స)

చ. రాజాధిపాన్వయ సాగర - రాజ నీవై విలసిల్లినఁ
దేజరిల్లఁగాఁ గృపఁజూతువే - ఈ జగమునఁ త్యాగరాజసన్నుత (స)

## ప్రతిపదార్థము.

సనాతన - పురాతనమైనవాఁడా
పరమపావన - పరమ పవిత్రుఁడా
ఘనాఘనవర్ణ - నీలమేఘమువంటి వర్ణముగలవాఁడా
కమలనయన - కమలములవంటి కన్నులుగలవాఁడా
తనవాఁడు అను - నీ సొంతమనుష్యుఁడను
అభిమానము - ప్రీతి
దైవమైన నీకు - రక్షకుఁడుగ నుండు నీకు
ఏల కలుగదో - ఎందుకు కలుగక పోయెనో
(సనాతనా)
'రాజాధిపా...రాజు'
రాజాధిపా - రాజుల కధిపతులైన చక్రవర్తులయొక్క-

ఇనవంశ క
సాగర సముద్రమునకు
రాజు చంద్రుఁడు
నీవు ఐ - నీవై
విలసిల్లి తే - ప్రకాశించుచున్న యెడల
తేజరిల్లఁగ - బాగుగ
కృపతో - దయతో
మాతువు ఏ - మాటఁ గలుగవా
ఈ జగమునతో - ఈ జగమునందు
త్యాగరాజనుత - త్యాగరాజుచే నుతింపఁబడు
రామా (సనాతనా)

విశేషార్థము: భక్తుఁడు శరణాగతి చేసినప్పుడు కాను శరణ చొచ్చినవాఁడు అందఱికొను

గొప్పవాఁడైన భగవంతుఁడే యను నెఱుకతో నుండవలయును; ఈకీర్తనమునందుఁ గల, 'సనాతనా...పరమపావన' మున్నగు విశేషణములచే అయ్యగారు, తాము శరణుచొచ్చినవాఁడు భగవంతుఁడే యని నిరూపించుచున్నారు.

'సనాతనా' అనుటచే 'తస్యైకస్య మహత్త్వం హి స చైకః పురుష స్స్మృతః। మహాపురుషశబ్దం స బిభర్త్యేకస్సనాతనః' అనఁగా సనాతనుఁడైనవాఁడు ఒక్కఁడుగ నుండి మహత్త్వమును వహించి మహాపురుషుఁడను పేరును బడసినవాఁడనియును; 'పరమపావన' అనుటచే, భగవంతుని పాదప్రక్షాళనముచే పవిత్రమైన గంగాజలమునే, 'తదంబు పరయా భక్త్యా దధార శిరసా హరః। పావనార్థం జటామధ్యే యోగ్యోఽస్మీత్యవధారణాత్' అనునటులు, పరమశివుఁడు తాను పావనుఁడగుటకై శిరమందుండు జటలలో వహించి నందువలన, భగవంతుఁడు పరమపావనుఁడనియు; 'ఘనాఘనవర్ణ' అనుటచే, ప్రతిఫలము నెవరు చూడకయే మేఘము వర్షించి సస్యములను కాపాడునటులు పరమాత్ముఁడు తన నిర్హేతుక కృపాకటాక్షముచే కృపారసమును వర్షించి జీవుని కాపాడువాఁడనియు; 'కమలనయన' అనుటచే, 'గంభీరాంభస్సముద్భూత, సుమృష్టనాళ రవికరవికసిత పుండ

రీకదళామలాయతేక్షణః' అనఁగా, లోఁతైన నీటియందు మొలచినదియును, అందమైన నాళము నందుండు నదియును, సూర్యునియొక్క కిరణములచేత వికసింపఁ జేయఁబడినదియు నైన తామర పువ్వుయొక్క దళములవలె నిర్మలముగను విశాలముగను నుండునట్టి నేత్రములు గలవాఁడై, 'సర్వసత్త్వ మనోహరః' అనుటలు సమస్త జీవకోటులయొక్క మనస్సు నాకర్షించువాఁడనియు నిరూపించుచున్నారు.

'తనవాఁడను అభిమానము దైవమైన నీకేల గలుగదో' అనుటచే, శ్రీరామా! 'ఆనృశంస్యం పరోధర్మస్త్వత్త ఏవమయా శ్రుతః' అనఁగా, ఇతరుల దుఃఖమును జూచి సహింపకుండుటయే పరమ ధర్మము, అని నీవే చెప్పియున్నావు; అట్టి నీ కిపుడు నాయం దభిమానము లేక పోవుటకు కారణమేమి యనుచున్నారు; అనఁగా, నా దుఃఖములను పోఁగొట్టి నన్నేలా నీవు కాపాడుటకు సిద్ధముగనే యున్నావు. 'మమైవదుష్కృతం కించి న్మహాదస్తి నసంశయః' అని సీతాదేవి చెప్పినటులు నాయందేమో పాపమున్నదని తలంచుచున్నానని భావము.

'రాజాధిపాస్వయ... తేజరిల్లఁగా కృపఁజూతువే' అనుటచే, శ్రీరా నేనెంత పాపిగ

నుండినను, 'రాజాధిరాజ స్సర్వేషాం విష్ణుర్బ్రహ్మ మహాన్ ఈశ్వరం తం విజానీమ స్సపితా స ప్రజాపతిః' అనునట్టులు, రాజాధిరాజుగను తండ్రిగను, బ్రహ్మగను, నిరంకుశ స్వాతంత్ర్యము గలిగియుండు నీవు నన్ను కాపాడ బూనినచో నిన్నాక్షేపించు వా రెవరు? అట్లుండియు నీవేల కాలహరణ మొనర్చెదవని ప్రార్థించుచున్నారని భావము.

ఫలమంజరి రాగలక్షణము:—ఇది వక్రషాడవ వక్ర సంపూర్ణ రాగము. 22-వ మేళము ఖరహరప్రియ జన్యము. సాధారణ గాంధార శుద్ధమధ్యమములును అల్ప పంచమమును రాగచ్ఛాయాస్వరములు. ఆరోహణమునందు పంచమము వక్రము. అవరోహణమునందు గాంధారము వక్రము. ఎల్లప్పుడును గానము సేయందగినది.

| ఆరోహణము. | అవరోహణము. |
|---|---|
| స గ మ ధ మ ధ సే. | సే ని ధ ప మ గ మ రి స. |

స. ; ; ; * సాగా ; ; - గ    పా ; ; . మధ    పగా ; - మా ||

: : : * సనా ; ; - త    నా ; ; . పరె    మపా ; - వ ||

2. రి ; ; * ,, | • • ,, | ,, ||
న ; ; * ,, | ,, | ,, ||

పమగమరిస * పమధా ; – నిధపమ | గా ; మా – ధా | పా గా ; – మా ||
న . . . . . * ఘ నా ; – ఘ. న . | వ ; ర్ణ – క | మ ల : – న ||

పమగమరిస *
యన . . . * (సనాతన)

అ. ; ; ; * మాధాసా , రిసే | గా , ; – గమ | రీసా ; నీ ||
; ; ; * త న వా ; డ | ను ; ; – న. | భి రు ; న ||

ధా ; ; * నిధపమపా ; మా | ధాసా ; – నిధ | పమగా ; మా ||
ము ; ; * దై .వ. మై ; న | నీ . . – కే | ల . గ ; ల్గ ||

పమగమరిస *
దో . . . . . * (సనాతన)

చ. ; ; ; * పా , మ - గా , మా | రీ ; ; - నీ | సాగా ; మా ||
; ; ; * రా , . - జా ; ధి | పా ; ; - న్వ | యసా ; గ ||

పా ; ; * నిధపమగా ; మా | ,, | ,, ||
ర ; ; * రా. . . జా , ధి | ,, | ,, ||

పా ; ; * మధసా - సనిధాపా | పమగా . - ధా | పాగా ; మా ||
ర ; ; * రా. జు - నీ. . . | వై. . ; - వి | ల సి ; ల్లి ||

పమగమరిస * మాధాసా ; రీసే | గా ; ; - గమ | రీసా ; నీ ||
న . . . . . * క్షే జ రి ; ల్ల. | గా ; ; - కృ. | పజూ ; తు |

ధా , పా , * నిధపమ - పాపామా | ధాసా ; - నిధ | పమగా ; మా |
వే , . , * ఈ.జ . - గ ము న | త్యాగ ; - రా | జ . స ; న్న ||

పమగమరిస *
త . . . . . * (సనాతనా)



అవతారిక:—ఈ కీర్తనమునందు అయ్యగారు, శ్రీరామా! నిన్ను దర్శించుట యందు దాశ గలవాడనై, నీయాజ్ఞా రూపమైన శాస్త్రములకు విరోధముగ నుండు కార్యములను మాని నిన్నే కీర్తించుచున్న నా మనవిని విని నన్ను రక్షింపుమనుచున్నారు.

(59) జయనారాయణి - ఆది.

ప. మనవిని వినుమా - మఱవ సమయమా (మ)

అ. కనుఁగొనఁగోరి దుష్కల్పనమానితిఁ - గనికరమున నినుఁ బాడుచున్న నా (మ)

చ. పరులకు హితమగు భావనగాని - చెఱచుమార్గములను చింతింపలేదు

పరమదయాకర భక్తమనోహర - ధరాధిప కరార్చిత త్యాగరాజు (మ)

ప్రతిపదార్థము.

నా - నాయొక్క
మనవిని - విన్నపమును
వినుమా - ఆలకింపుమా

కనుఁగొనఁ - నిన్ను సేవించుటకు
కోరి - ఆసగొని
దుష్కల్పన - దుష్టచిత్తములను

మానితిక్ - విడిచిపెట్టితిని
కనికరమునక్ - అత్యంత ప్రీ
నినుక్ - నిన్ను
పాడుచున్న - కీర్తించుచున్న
నా - నాయొక్క
(మనసా ని వినుమా)
పరులకు హితము అగు ఇతరులకు మంచిదగు
భావనకాని - తలంపే ని

చెడుచుమార్గమును - చెడుపు చేయు సద్విక్రోవను
చింతింపలేను - ఎంతమాత్రము తలపోయను
పరమ దయాకర - అత్యంతము ప్రీతిని చేయువాడా
భక్తమనోహర - భక్తుల మనస్సును అపహరించువాడా
ధరాధిపా - భూమికి అధిపుడా
కరార్చిత త్యాగరాజు - కరములచే పర్చించబడిన త్యాగ
రాజుయొక్క
(మనసా ని వినుమా)

విశేషార్థము: —'మనసా ని... బాడుచున్న నా' అనుటచే, శ్రీరామా! 'పరాఙ్ముఖానాం గోవిందే విషయాసక్తచేతసామ్। తేషాం తత్పరమం బ్రహ్మ దూరాద్దూరతరే స్థితమ్॥ తన్మయత్వేన గోవిందే యే నరా న్యస్తచేతసః। విషయత్యాగినస్తేషాం విజ్ఞేయం చ తదంతికే' అనునటులు, విషయములందు దాశగలిగి యుండువానికి భగవంతుడు చాల దూరమునందుండు వాడనియు, భగవంతునియందే చేర్పబడిన మనస్సుగలవారికి ఆ భగవంతుడు చాల సమీపమున

నున్నవాఁడనియు నుండుటచే, నేను దుష్కల్పనమును మాని, 'న దేవ న ప్రాణా...విజ్ఞాం స మిదం' అనునటులు నీ కైంకర్యములకు విరోధముగ నుండు శరీరముగాని ప్రాణముగాని మరేదియుఁ గాని వేయివిధముల నశించి పోనీ యని తలంపుగలిగి, 'తవ స్మారం స్మారం గుణగణ మితీచ్ఛామి గతభీః' అనునటులు, నీ కల్యాణగుణములనే తలఁచి తలఁచి భయములేనివాఁడనై యుండుటకు కోరుచున్న నా మనవిని విని నీ దివ్యమంగళసేవ నొసంగుమను చున్నారని భావము.

'పరులకు హితముగు భావన...త్యాగరాజు మనవిని వినుమా' అనుటచే, శ్రీరామా! 'అహింసా పరమో ధర్మః' అనునటులు, ఇతరులకు మేలుచేయుక పోయినను కీడు చేసి పరులను హింస పెట్టఁగూడ దనునది గొప్పధర్మమని చెప్పియుంటుటచే ఆ యొక్క ధర్మమును మాకు సూచ రించుచున్నాఁడను. ఈ యొక ధర్మమునకై నీకెట్టి నా సేవ గలుగును? అనుదువేని, 'దయ సింధో బంధో నిరవధిక వాత్సల్యజలధే' అనునటులు, నీవు దయాసముద్రుఁడవై, దీనబంధువై, మితిలేని వాత్సల్యముగలవాఁడవై యున్నావు; 'రిపూణా మపి వత్సలః' అనునటులు, శత్రువులందును ప్రీతిగలిగి యుండువాఁడవు; శత్రువుల యపరాధములే నీను వాత్సల్య సముద్రమునందు మునిఁగి

నశించి పోవుచుండఁగ నీదు మిత్రుఁడ నైన నా యపరాధములను మన్నింపక యున్నావా? ఇఁక కృపా వశుఁడవై నాకు సేవ యొసఁగరాదా? అనుచున్నారని భావము.

జయనారాయణి రాగలక్షణము. ఇది షాడవ సంపూర్ణ రాగము ఖరహరప్రియ జన్యము. సాధారణ గాంధార చతుశ్శ్రుతి ధైవత రాగచ్ఛాయ స్వరములు. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

ఆరోహణము. సరిగామపధసా.

అవరోహణము. సనిధపమగరిస.

ప. 1. ; * మగా - రిగా - మాపా - పా ; | ; - మగా - రిగా | మాపాపమ - గమ ||

; * మన - విని - విను - మా ; | ; - మన - విని | వినుమా. - . . ||

3. పాధప * ,, - నీనిధ | ధప- ,, | మాపా - పాసని ||

. . . * ,, - మా. | . - .. | విను - మా. . ||

5. ధప * ,, మాగరి - సా ; | ; ; ధస్సా - ధస్సా   రిగమగ - రి గమప ||
.. * ,, వి ను - మా ; | ; - మ అ - వ స   వ . . . - య. మా ||
ధప * మగా - రిగా - మాపా - పా ; |
.. * మ న - విని - వి ను - మా, | (ఇచట నిలుపవలెను)

అ. ; * పధా - పధా - సా ; సాసా | ; - పధా - పధా   సా ; రీరీ ||
; * క ను - గొన - గో ; రి . | ; - కను - గొన   గో ; రి . . ||
; * పధా-పధా-సా-పధసరి-రీగరి | రీ - గగా - రిగా   మాగా - రీసా ||
; * కను -గొన-గో . రి . -డు . . | . - ప్ర - ల్పన   మా . - ని తి ||
; * ,, | ,,   రిగమగ - మామా ||
; * ,, | ,,   మా . - ని తి ||
; * సమా - గమా - రీగా - గరిరీ   నీసా రీగరి - సరిసా   గరిరిస - సనిధ ||
; * క ని - క ర - మున - నిన్ను   పా.   చున్న ||

ధ ప * .
. . * (మన

చ. ; * పపా - పపా - మాపగ - రిగమా | ; - పధస - నిధా | గపపమ - గరిరీ ||
; * ప రు - లకు - హిత . - మ. గు | ; - భా . - వ న | గా . . - ని . . ||

; * ధసా - ధసా - రిగమగ - గారీ | ; - గగ - రీగా | రిగమప - పాపా ||
; * చెలి - చుమా - ర్గ. ము. - ల ను | ; - చిం - తించ | లే. . . - . ను ||

; * పధా - పధా - సా ; రిరీ | ; - సగా - రిగా | రిగమగ - మామా ||
; * ప ర - మద మా ; కర | ; - భ . - క్తను | నో . . . - హ రా ||

; * సమా - గమా - రీగా - గరిరీ | రీసా రీగరి - సరిసా | గరిరిస - సనినిధ ||
; * దరా - ది ప గా - ర్చి. త | త్యా . . . - గ . రా | జు . . . - . . . . ||

ధ ప *
. . * (మన



అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు శ్రీరామ భక్తియను చక్రవర్తి పదవియందుఁ గలుగు ఆనంద మిట్టిదని చెప్పుటకు సాధ్యము కానిది యనుచున్నారు.

(60) శుద్ధబంగాళ – ఆది.

ప. రామభక్తి సామ్రాజ్య – మే మానవులకబ్బెనో మనసా (రా)

అ. ఆ మానవుల సందర్శన – మత్యంత బ్రహ్మానందమే (రా)

చ. ఈలాగని వివరింపలేను – చాలస్వానుభవవేద్యమే
లీలాసృష్టజగత్త్రయమను – గోలాహల త్యాగరాజనుతమగు (రా)

ప్రతిపదార్థము.

మనసా – ఓ మనస్సా
రామభక్తి సామ్రాజ్యము – రామభక్తియను చక్రవర్తిపదవి
౧ మానవులకుక్ – ఎట్టి మనుష్యులకు
౨ అబ్బెనో ఓ – చిక్కెనదో
౩ మానవుల (రామభక్తి యబ్బిన) అట్టి మానవుల యొక్క–

సందర్శనము - మంచి సేవ
అత్యంత బ్రహ్మానందము ఏ-మికల సకగమైనదిరో
(రామభక్తి)
ఈలాగని-(ఆ యానందముయొక్క- పరిమితి) ఇటువంటిదని
వివరింపలేను - విచ్చి చెప్పలేను
చాల స్వానుభవ వేద్యమే - అది యెంతయు ఆత్మాను
భవమువల్లనే యెఱుంగ దగినయది

'లీలా...మున
లీలా - భగవ క్రీడచే
సృష్ట - కల్పితంబులైన
జగత్త్రియమున - ముజ్జగముల మును
కోలాహల త్యాగరాజ వినుత - కుతూహలముతోఁ
గూడుకొన్న త్యాగరాజుచే కొనియాడఁబడు
(రామభక్తి సామ్రాజ్యము)

విశేషార్థము:—'రమంతే యోగినో౽నంతే సత్యానందే చిదాత్మని । ఇతి రామపదేనా సౌ పరబ్రహ్మాభిధీయతే' అను వాక్యముచే, శ్రీరాముఁడు పరబ్రహ్మ మనియే యెఱుంగఁదగినవాఁడు. 'బ్రహ్మాదయస్సురా స్సర్వే విష్ణుమారాధ్య తే పురా । స్వం స్వం పదమనుప్రాప్తాః కేశవస్య ప్రసాదతః' అనఁగా, బ్రహ్మాది సమస్త దేవతలును భగవదారాధనముచేతనే వారివారి పదములను బడసినారని, నృసింహ పురాణమునందు చెప్పఁబడినది. కర్మకాండమునందు, 'నిత్యమర్చయసే దేవ కం దేవ మధికం తవ । యస్మాన్నానస మవ్యగ్రం కృత్వా త్రిభువనేశ్వర ॥ జపహోమా

నమస్కారై స్తం వదస్వ తథానయా' అనఁగా, త్రిభువనేశ్వరుఁ డగు నుండు రుద్రమూర్తి! నీవు నీకన్న గొప్పవాఁడగు ఏదేవునిగూర్చి జపహోమ నమస్కారాదులను చేయుచున్నావో ఆ దేవుని నాకెఱుఁగఁజెప్పుము అని పార్వతి యడిగినందుకు, 'అజ్ఞానార్ణవ మగ్నానాం సర్వేషామాత్మనామయమ్। విష్ణుర్ధర్మోడుప శ్శ్రీమా నుత్తరార్థ ముదాహృతః' అనఁగా, శ్రీలక్ష్మీ సమేతుండైన శ్రీమన్నారాయణుండు ధర్మార్థమైన తెప్పగనుండి అందఱను భవసాగరమునుండి తరింపఁజేయువాఁడు వానికే నేను నమస్కరించుచున్నాను, అని బదులు చెప్పెను. మఱియొక సమయంబున ఏది నామములలో శ్రేష్ఠమైనదని యడిగిన పార్వతికి, 'శ్రీరామరామ రామేతి రమే రామే మనోరమే। సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే' అని శ్రీరామనామమే శ్రేష్ఠమైనదని పరమశివుఁడు బదులు చెప్పెను. శ్రీరాముఁడు హనుమంతునకు వైకుంఠపదవి నిచ్చుటకై యడిగినప్పుడు ఆంజనేయుఁడు, 'స్నేహో మే పరమో రామ త్వయి నిత్యం ప్రతిష్ఠితః। భక్త్యా నియమితా వీర భావో నాన్యత్ర గచ్ఛతి' శ్రీరామా! నాకు నీయందే భక్తి నెలకొనియున్నది ఈ యవతారమునందే ప్రీతియును అధికముగ నున్నది. కనుక నాకు వేఱొదియు నొక పదవి అక్కఱలేదని చెప్పెను. ఇత్యాది కార

ణములచే, అయ్యగారు బ్రహ్మాదిదేవత లందఱకును వారివారి పదముల నిచ్చినట్టి రామభక్తిని బడసినట్టి మానవుని దర్శనము బ్రహ్మానందము నిచ్చుననుచున్నారు.

'ఈలాగని వివరింపలేను చాల స్వానుభవవేద్యమే' అనుటచే, 'యువా స్యాత్సాధు యువాధ్యాయకః। ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః। తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్। స ఏకో మానుష ఆనందః' అనఁగా యౌవనకాలమునందే సాంగాధ్యాయిగ నుండుట, చిరంజీవిగను దృఢగాత్రములు గలిగి ఆరోగిరై యుండుట, భూమియందుఁ గల సమస్త సంపదలచేతను సమృద్ధి నొందియుండుట అనునది మనుష్యానందముయొక్క పరిమితి. ఈ పరిమితినుండి నూఱు నూఱుభాగములుగ, మానుషానందము, మనుష్యగంధర్వానందము, దేవానందము మున్నగు ఆనందములు హెచ్చిపోవుచుండును. శ్రీరామ భక్తిచేఁ గలుగు ఆనందమన్ననో పరిమితిలేనిదిరై అనుభవించినకొలఁది అధికముఁగ వృద్ధి నొందుచున్నదిరై యున్నదని అయ్యగారు ప్రకటించుచున్నారని భావము.

శుద్ధబంగాళ రాగలక్షణము:- ఔడవ వక్రషాడవరాగవ, చతుశ్శ్రుతి ఋషభ సాధా

రణ గాంధారములు రాగచ్ఛాయాస్వరములు. 22-వ మేళము ఖరహరప్రియజన్యము ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

| ఆరోహణము | అవరోహణము. |
|---|---|
| స రి మ ప ధ సా. | స ధ ప మ రి గ రి స. |

మారిగరిస - రిగరిరిసధ - గగరిరిసధ । మొదలగు ప్రయోగవ లు రాగ రంజకమైనవి, మఱియు రిగరిస - మారిగరిస - రీగగరిస అను మధ్యమ ఋషభ గాంధార ప్రయోగములవలననే ఈ రాగము రక్తిఁ జెందుచున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| ప. ; * | ధ్సాసాసా - రీ ; రీ ; | ; - సరిమా - ; | రీగా - గరిరిస | ॥ |
| , * | రా . మ - భ ; క్తి ; | ; - సా . - ; | ప్రా. - జ్యా. . | ॥ |
| 2 సధ * | సా ; సారీ ; - సరిమా | , రి - రిమపామా | ,, | ॥ |
| .. * | రా ; మభ ; | , . - సా . . | ,, | ॥ |

సా * పాహా , మ – దా ; దాధా | , – మపధా పా | ధ పమప – పా ; ||
. * లీ లా , . – స్ఫు ; ట్ట జ | ; – గ . . త్రి) | యా.ను. – న ; ||

పమ* ,, | ,, | ద ధపమ – రిమరిమ ||
. .* ,, | ,, | యా.ను. – న . . . ||

పమ* ,, | ; – పనిసధప మ | ప ధసిధ – సా సిధ ||
. .* ,, | ; – గ. . . త్రి). | యా.ను. – న . . ||

పమ* ,, | ,, | ప ధసిధ – సాసా ||
. .* ,, | ,, | యా.ను. – న . ||

; * రీ స్రీ ; సరిమా – రీ ; | సా – సా , ధపమ | రిగా – గ రిరిస ||
; * క్రోలా; హ. ల – త్యా, | గ – రా . జని . | నుత – మహా. . ||

సధ *

(రామభక్తి)



అవతారిక:— ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరామా! భక్తియను గంధమే లేని పామరుల సమూహములో నన్ను వైచి వేడుక చూచుచున్నావే! ఇదియేమి? నా జన్మాంతరపాపమా! అని నొచ్చుకొనుచున్నారు.

(61) శుద్ధబంగాళ - ఆది.

ప. తొలి నేఁ జేసిన పూజాఫలము - దెలిసెను నాపాలిదైవమా (తొ)

అ. పలువిధములనేఁ దలఁచి కరఁగఁగా - పలుకక నీవటు నేనిటుకాఁగ (తొ)

చ. పరివారలలోఁ జేకచేసి యు - దరపోషకులను పొరుగునఁజేసి
హరిదాస రహిత పురమున వేసి - దరిఁజూపకుండఁగఁ ద్యాగరాజార్చిత(తొ)

ప్రతిపదార్థము.

నాపాలిదైవమా - నాపాలి శ్రీరామా
తొలి-మునుపు, పూర్వజన్మమునందు
నేఁజేసిన - నే నొనర్చిన
పూజాఫలము - పూజలయొక్క ఫలము
తెలిసెను - (చక్కఁగ) తెలియవచ్చెను
(తొలి)

పలువిధములఁ - నా విధముల
నేఁ - నేను
తలఁచి - చింతించి
కరఁగఁగఁ - కరఁగుచుండఁగ
పలుకక - బదులుచెప్పక
నీవు అటు - నీవటు (చూచుచుండుట)
నే నిటు - నే నిట్లె (మొఱఁబెట్టు చుండుట)
కాఁగాఁ - అయినందువలన
(తొలి నేఁ జేసిన)
త్యాగరాజార్చిత - త్యాగరాజుచే పూజింపఁబడురామా

సరివారలలోఁ - సమానమైన వారి మధ్యలో
చౌకఁ చేసి - నన్ను చులకనచేసి
ఉదరపోషకులను - పొట్ట పోసికొనువారలను
నా పొరుగునఁ చేసి - నాప్రక్కలో చేర్చి
హరిదాస రక్షిత పురమునఁ - హరిదాసులే లేని యూరి యందు
వేసి - కాపురము చేయనిచ్చి
దరిఁజూపకుండఁగఁ - మంచిమార్గమును నీవుచూపించక యుండఁగ
(తొలి నేఁ చేసిన పూజాఫలము తెలిసెను)

విశేషార్థము:—ఈ కీర్తనమునందు, శ్రీరామా! పూర్వజన్మమునందు నేను మంచిపూజలను చేయలేదని తెలియుచున్నది. ఎట్లనిన, అనేక విధములుగ నాకు కొఱఁతలను తెలిపి మొఱఁబెట్టు కొన్నను నీవేమో పలుకకయే యున్నావు. నే నేమో ఇట్లు కష్టముల ననుభవించుచున్నాను. పరివారలైన దాసుల సమూహమునందు నన్నుమాత్రము కరుణింపక యుండుట తగునా? మంచి

సాంగత్యమును, చూపక పొట్టపోసికొనుటకై నీచవృత్తులను చేయువారలను నాప్రక్క చేర్చిపెట్టితివి. 'యేతు సామాన్యభావేన మన్యంతే పురుషోత్తమమ్। తేవై పాషండినో జ్ఞేయా సర్వకర్మ బహిష్కృతాః' అనునటులు పురుషోత్తముఁడవగు నిన్ను సామాన్యదైవముగ తలఁచి అధములై నరకములకు పోవువారును, 'యో విష్ణుం సంతతం ద్వేష్టి తం వింద్యాదన్త్యరేతసమ్' అనునటులు నిన్ను ద్వేషించి చండాలత్వమును సంపాదించుకొనువారుగను, నీ భక్తియను గంధమే లేని వారుగను నుండు జనులు నిండిన యొకయూరిలో నన్ను తెచ్చివేసితివి, 'యే ద్విషంతి మహాత్మానం నస్మరంతి చ కేశవమ్। న తేషాం పుణ్యతీర్థేషు గతి స్సంసర్గిణామపి' అనునటులు, ఎవఁడు మహాత్ముఁడైన భగవంతుని ద్వేషించునో లేక వానిని స్మరింపకయుండునో అట్టివానినిగాని, వాని సంసర్గము గలిగినవానినిగాని పుణ్యతీర్థములుగూడ పరిశుద్ధునిగా చేయఁజాలవని చెప్పఁబడియున్నది. ఇట్లు హరిదాస రహితపురమునఁ గాపురము చేయుటచే స్వరూపనాశము గలిగి నశించుచున్న నా కొక మంచిమార్గమును చూపకయే నీ వుండుదువేని ఇది నా జన్మాంతర కర్మమనియే గదా చింతిల్లవలయును; అని యయ్యగారు తాము నొచ్చుకొని, హరిభక్తి లేనివారిని చూచి పరితాపము

నొందుచున్నారని భావము.

ప. ; * రిమపా ; – దధపా – పాపా | మపధా – ధపమా | రీగా – గరిస ||
; * తొలినే; – జే.. – సిన | పూ.. – జా. | ఫల – ము. ||
సా –* ,, | మపధసి – ధపమా | ,, ||
. –* ,, | పూ.. – జా.. | ,, ||
,, * ధసాధసా – రీమాపాదా | ధసిధా – పాపూ | రీగా – గరిరిస ||
,, * దెలిసెను – నా.పా. | ..లి – దై. | .వ – మా. ||
,, *
,, * (తొలినే)

అ. ; * పపా – ధసా – పధసిధ – సా ; | ; – సరిగారీ – | రీగా – గరిరీ – ||
; * పలు – విధ – ముల. – నే ; | ; – గలచిక – | రగ – గా.. – ||
; * సిధా – సిధా – ధపపప – పాధా | సా ; ధా – పధ | స – ధపమ – రిగగరి ||
; * పలు – క క – నీ... – పటు | నే ; ని – టు | .. – కా. – గ.. ||

రిస *
.. * (తొలిసే)

చ. ; * సరిమా ; – రిగరిస – రీమా | ; – పధాపమా | రీగా – గరిరిస ||
; * సరివా ; – ర.ల. – లో. | ; – జా. క జే | .. – సి. . . ||

సా * ధ.సా – ధ.సా – రీమా – రిగగరి | స – రిమాపధా – | ధసిదధపా ; – ||
. * ఉ ద – ర పో – షణ – ల,ను, | . . – పొరుగున – | జే. . . సి ; – ||

; * మపాధసా – పధసధ – సాసా | ; – సరి గరి | రిగా – గరిరి ||
; * హ రి దా. – స . ర. – హి త | ; – పురమున | వే . – సి . . ||

; * సధా–సధా–ధపపమ–పాధా | సా ; ధా – పధ | సి – ధపమ – రిగగరి ||
; * ద రి –జూప–రుం . –డ గ | త్యా ; గ – రా | . – జా. . – ర్చిత. ||

రిస *
.. * (తొలిసే)

అవతారిక:—ఈ కీర్తనమునందయ్యగారు, లోకాచార్యులైన నారదులను నుతియించుచున్నారు.

27

(62) కానడ - రూపకము.

ప. శ్రీనారద నాదసర - సీరుహాభృంగ శుభాంగ (శ్రీ)

అ. దీనమానరక్షక జగ - దీశ భేశసంకాశ (శ్రీ)

చ. వేదజనితవరవీణా - వాదన తత్త్వజ్ఞ ఖేద
హర త్రితాపరహిత - ఖేచరవినుత
యాదవకులజాప్త సదా - మోదహృదయ
మునివర్య శ్రీద త్యాగరాజ - వినుత శ్రీకర మాంపాలయ (శ్రీ)

ప్రతిపదార్థము.

శ్రీ నారద - శ్రీ నారదమునీ
నాద - నాదమను
సరసీరుహా - తామరపువ్వునందలి
నాద..భృంగ

భృంగ – భ్రమరమా
శుభాంగ – మంగళకరమైన అంగములు గలవాఁడా
'దీన...రక్షక'
దీన – దీనజనులయొక్క
మాన – మానమును
రక్షక – కాపాడువాఁడా
జగదీశ – లోకుల కీశ్వరుఁడైనవాఁడా
శశిసంకాశ – చంద్రసమానుఁడా

(శ్రీనారద)

'వేద...తత్త్వజ్ఞ'
వేద – వేదమునందు
జనిత – పుట్టినట్టి
వర – శ్లాఘ్యమైన
వీణా వాదన – వీణను వాయించువాఁడా
తత్త్వజ్ఞ – తత్త్వములను తెలిసినవాఁడా
ఖేదహర – వ్యసనమును పోఁగొట్టువాఁడా
త్రితాపరహిత – తాపత్రయము లేనివాఁడా
ఖేచరవినుత – దేవతలచే కొనియాడఁబడినవాఁడా

'యాదవ...జాప్త'
యాదవ – గొల్లవారియొక్క
కుల – కులమునందు
జ – పుట్టినట్టి శ్రీకృష్ణునికి
ఆప్తా – ప్రియమైనవాఁడా

'సదా...హృదయ'
సదా – ఎల్లప్పుడును
మోద – సంతోషముతో కూడుకొన్న
హృదయ – మనస్సుగలవాఁడా
మునివరా మునులయందు శ్రేష్ఠుఁడా

శ్రీద - సంపదల నిచ్చువాఁడా
త్యాగరాజవినుత - త్యాగరాజుచే నుతింపఁబడినవాఁడా
శ్రీకర - క్షేమమును చేయువాఁడా
మామ్ - నన్ను
పాలయ - కాపాడుము

విశేషార్థము:—'శ్రీనారద...శుభాంగ' అనుటచే తనచేత 'మహతి' అను వీణను బుచ్చుకొని, సదా భగవద్గుణానుభవములను కీర్తింపుచు, త్రిలోకములయందును సంచరించుచుండు లోకాచార్యులైన నారదమహామునిని గురువుగ వరించి అయ్యగారు తాము చేయు గానరూపమైన భక్తిమార్గమునకు కావలసిన రహస్యముల నెఱుఁగఁగోరుచున్నారని భావము.

'దీనమాన రక్షక జగదీశ' అనుటచే, 'గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరాగతిః' అనునటులు, చేతనునికి గురువే పరబ్రహ్మమనియు, వాఁడే పరమగతియనియు చెప్పి యుండుటచే అయ్యగారు శ్రీనారదులనే తమకు రక్షకుఁడుగ కోరుచున్నారని భావము.

'గురుపాదాంబుజం ధ్యాయేత్ గురునామ జపేత్ సదా । గురోర్వార్తాం కథాం చైవ గురోరన్యాం న భావయేత్' అనఁగా, గురువుయొక్క పాదాంబుజములను ధ్యానించుచును, వాని

నామమును జపించుచును, వాని వార్తలను వాని చరిత్రములను నుతుపుచును శిష్యుల కుండవల యును, గురువుచు తప్ప వేఱైన వానిని నెంచఁగూడదు అని భావము. ఇట్లు గలిగియున్న ప్రమా ణముల ననుసరించియే అయ్యగారును, 'వేదజనిత...పాలయ' ఇత్యాదులచే, వీణ వాదనము చేయు టయందు సాటిలేనివాఁడా! తత్త్వజ్ఞానము గలవాఁడా! దుఃఖములను బోఁగొట్టువాఁడా! తాపత్ర యము లేనివాఁడా! మున్నగు విశేషణములచే స్తోత్రము చేసి తుదకు, 'మాంపాలయ' అని శరణా గతి చేయుచున్నారని భావము.

కానడ రాగలక్షణము:—ఇది వక్రసంపూర్ణ రాగము. ఈ రాగమును 'కన్నడ' అనియు కొందఱు చెప్పుదురు. కన్నడయని మఱియొక రాగ ముండుటచే దీనిని కానడ అనియే వాడుట సంప్రదాయముగ నున్నది. 22-వ మేళమైన ఖరహరప్రియయందు జన్యము. 28-వ మేళమునందు జన్యమని కొందఱ యభిమతము. చతుశ్శ్రుతి ధైవత సాధారణ గాంధారములు రాగచ్ఛాయా స్వర ములు. ఆరోహణమునందు ధైవతమును అవరోహణమునందు గాంధారమును దీర్ఘముగఁ బట్టుటచే నీ రాగమునకు రక్తి x గుచున్నది. కొం: తావులలో కాకలీ నిషాదమును, అంతర గాంధార

మును 'రాగచ్ఛాయగా' పలుకుచుండును. ఇది దేశ్యరాగము గనుక ఒక త్రోవ ననుసరించి యుండలేదు. ఈ రాగమునందుఁ గల అనేక ప్రయోగములు అనుభవ వేద్యముగ నున్నవి.

| ఆరోహణము. | అవరోహణము. |
|---|---|
| గ రి స రి గ మ ప మ ధా ని స. | స ని స ధ ప మ గ మ రి స. |

| | | | | |
|---|---|---|---|---|
| ప. లీ ; | \| సా ; - ని̣సా | \|\| ధా̣ని̣ | \| ధా̣ - ని̣సాసా | \|\| |
| శ్రీ; | \| నా ; - గద | \|\| నా . | \| . - ద స ర | \|\| |
| ,, | \| ని̣సరిస - సరిసా | \|\| ధా̣ని̣ | \| ధా̣ - ని̣సాసా | \|\| |
| ,, | \| నా. . - ర. ద | \|\| నా. | \| . - ద స ర | \|\| |
| రిమాగ | \| రిససా - సని̣రిస | \|\| ,, | \| ,, | \|\| |
| శ్రీ. . | \| నా . - ర.ద . | \|\| ,, | \| ,, | \|\| |
| ; రీ | \| రీగా - మా , | \|\| పా - మప | \| గా , మరిసని̣స | \|\| |
| ; నీ | \| దహా - భ్యం, | \|\| గ - కు. | \| ఖాం, గ . . . . | \|\| |

గాఘు రీ - రిసనీసా || ధపమప గా , మరిసనిప ||
ధీ . శ - ఖే . . శ || సం . . కా . శ . . . . ||

చ. మాధా పా - మాపాపా || మాపా | పమగ మా ; ||
వే . ద్య - జని త || వర | వీ . . ణా ; ||

ధపమప | గా , మ - రీసా || సా , ని | రీ , ససా , స ||
వా . . | . , . - దన || త , . త్వ , . జ్ఞ , . ||

సానీ | సారి రీరి || గా ; మా - ధనిసరిసా ||
ఖే . | ద హరత్రి || తా ; ప - ర. పి . త ||

నిసిధని | పామాప - గాగా || గమారి సా ; ; ; ||
ఖే. . . | చర . - విను || త . . . ; ; ; ||

రీ పా మాధప - రిగమప || గాగా మారీ - సా ||
ద్యా. దప. - ను. || జా . ప్తస - దా ||

| | | | | | |
|---|---|---|---|---|---|
| ; రీ | రీగాగామా - | ‖ | నీధా | \| ధపపమపా ; | ‖ |
| ; మో | దహృదయ - | ‖ | ముని | \| వ . . . ర్యా; | ‖ |
| పాధా | పా - మా ; పా | ‖ | పమగా | \| మా - దాదాధా | ‖ |
| శ్రీ . | ద - త్యా; గ | ‖ | రా. . | \| జ - వి నుత | ‖ |
| నిధపా | పా - ధపమాపా | ‖ | పమగా | \| మా - ధానీసరీ | ‖ |
| శ్రీ. . | ద - త్యా . గ | ‖ | రా. . | \| జ - వి నుత. | ‖ |
| సనిపా | పా - ధపమాపా | ‖ | ,, | \| మా - ధానిసరిమ | ‖ |
| శ్రీ. . | ద - త్యా . గ | ‖ | ,, | \| జ - వి . నుత | ‖ |
| రిసనిధ | పా - ధపమాపా | ‖ | ,, | \| మా - ధానిసరీ | ‖ |
| శ్రీ. . . | ద - త్యా. గ | ‖ | ,, | \| జ - వి ను. త | ‖ |
| గా ; | మారీ - సా ; | ‖ | ధపమప | \| గా ; మరీసా | ‖ |
| శ్రీ ; | క ర - మాం; | ‖ | పా . . | \| . ; లయ . | ‖ |

శ్రీ (నారద,



అవతారిక:— ఈకీర్తనమునం దయ్యగారు; శాంతి గలిగిన మనస్సుతో శ్రీరామనామము ననుభవించుచు బ్రహ్మానందసుఖము ననుభవించు వారెవరో! అనుచున్నారు.

(63) కానడ - దేశాది.

ప. సుఖి యెవ్వరో రామ నామ - సుఖి యెవ్వరో (సు)

అ. సుఖి యెవ్వరో సుముఖి యెవ్వరో - అఖిలసారమగు తారకనామ (సు)

చ. సత్యము తప్పక సకలలోకులకు - భృత్యుండై దైవభేదములేక
నిత్యమైన సుస్వరగానముతో - నిరంతరము త్యాగరాజనుత (సు)

ప్రతిపదార్థము.

సుఖి - సుఖము ననుభవించువాఁడు
ఎవ్వరు ఓ - ఎవరో
రామనామ - రామనామ స్మరణచేతను
సుఖి ఎవ్వరో - సుఖము ననుభవించు వాఁ రెవరో
సుముఖి ఎవ్వరో - మంచి ముఖము గలిగినవా రెవరో
అఖిలసారమగు - అన్నిటికన్న సత్తగు
'తారకనామ సుఖి'
తారకనామ - తారకమంత్రమగు శ్రీరామనామము

ననుభరించి
సుఖి - సుఖపడువాఁడు
ఎవ్వారో - ఎవరో
సత్యము తప్పక - సత్యమైన మార్గము నుండి తప్పిపోక
సకలలోకులకు - లోకమున భక్తులందఱకును
భృత్యుఁడై - దాసానుదాసుఁడై
దైవభేదములేక - దైవములయందు ద్వేషబుద్ధిలేక

నిత్యమై - స్థిరమైన
సుస్వరగానముతో - అపస్వరములేని గానముతో
నిరంతరము - ఎల్లప్పుడును
త్యాగరాజనుత - త్యాగరాజుచే నుతింపఁబడు
నామసుఖి - శ్రీరామనామము ననుభవించి సుఖపడు
వాఁడు
ఎవరో - ఎవరో

విశేషార్థము:—'రామ రామ తవ నామ జపంతః పామరా అపి తరంతి భవాబ్ధిమ్' అనునటులు శ్రీరామమంత్రము జీవుని భవసాగరము నుండి దాఁటించునది. 'రాశబ్దోచ్చార మాత్రేణ ముఖాన్నిర్యాంతి పాతకాః । పునః ప్రవేశభీత్యాచ మకారస్తత్కవాటవత్' అనఁగా, రామనామమునందుఁ గల 'రా' అను అక్షరమును ఉచ్చరించిన యపుడే జీవునియందుఁగల సమస్త పాపములును నశించి పోవుచున్నవి యనియు, 'మ' అను అక్షరము, మఱల పాపములను చేరనీక కవాటమువలె నోటిని మూయుచున్నదనియును చెప్పఁబడి న్నది. ఇట్టి మహాప్రభావముగల రామమంత్రమును జపిం

చుటచేఁ గలుగు ఆనందము ననుభవించి సుఖము నొందువాఁడే మహాత్ముఁడని అయ్యగారు వెల్లడించుచున్నారు.

'సత్యము తప్పక...నామ' అనుటచే, అబద్ధములాడక భక్తులకు దాసానుదాసుఁడుగనుండి, దైవ ద్వేషములులేక మంచి గానముతో శ్రీరామనామమును చేర్చి పాడి భజించువారికి ఆరామ ప్రసాద మతి శీఘ్రముగ దొరకుచున్నది యనుచున్నారు.

ఇందుఁగల 'దైవభేదములేక' అను ప్రయోగముచే లోకమునందుఁగల అన్ని దైవములను సేవింపవలయునని కానేఁరదు. 'మత్ప్రియ శ్శంకరద్వేషీ మద్వేషీ శంకరప్రియః' ఇత్యాదివాక్యములలో చెప్పియుండునటులు ఇతర దైవములయందు ద్వేషబుద్ధి గలుగుట సత్త్వగుణయుక్తంబైన యోగమునకు విరోధమై యున్నందువలన అట్టి ద్వేషము లేమియు లేక శ్రీరామునియందే నిలుకడగల్గిన మనస్సుగలవాఁడై వానినే భజింపవలయునని భావము.

| ప. ; ; ; * రీ రీ గా ; గా | మా - గమ | పా - పమగా - గమ || |
|---|---|---|
| - ; ; ; * సుఖిమొ ; న్న | రో - రా. | . - మ. . - నా. || |

రీ – సనిసా * ,, | ,, | ధప – పమగా – గమ ||
. – మ. . * ,, | ,, | . . – మ. . – నా. ||

రీ – సనిసా * రీ రీ గా ; మా | నిధపమగా – గమ | పా – పమగా – గమ ||
. – మ. . * సుఖియె ; వ్వ | రో . . . – రా. | . – మ. . – నా. ||

,, * ,, | ధనిధనిసా – నిస | ధపగా ; – గమ ||
,, * ,, | రో . . . – రా. | . . మ ; – నా. ||

,, *
,, * (సుఖి)

అ. ; ; ; * ధాపాధా ; నీ | సా , సా , – సరి | సరినీ నీసీ – నిస ||
; ; ; * సు ఖి యె ; వ్వ | రో , సు , – ము. | ఖి యె.వ్వ – రో. ||

ధపమా ; * ,, | ,, | సరినీ ; సా – ధప ||
. . . ; * ,, | ,, | ఖి.యె; వ్వ – రో. ||

, ని̣సా ; * నిగామధా – నీసా | ధపగా ; – మప మరిగా – గమరీ ||
, లకు ; * భృత్యుడై – . . | దై. వ ; – శే . దము– లే . . ||

సని̣సా ; * ధపాధా ; నీ | సా , ; – సరి సరిసీనీనీ– నిసి ||
. . క ; * నిత్య మై ; న | సు ; ; – స్వ ర . గాన – ము ||

ధపమా ; * ,, | ,, పమ – రీ ; సా ||
. . తో ; * ,, | ,, . . – గా ; న ||

నిపీపా ; * గామాదా దాధా | నీసా ; – ధా పాగా ; మా ||
ముతో ; * నిరతర ము | త్యాగ ; – రా జను ; త ||

పమగమరిస *
నా . . మ. * (సుఖియెవ్వరో)



అవతారిక: ఈకీర్తనయందు త్యాగరాజు, శ్రీరామ! నీవు ఆశ్రితులను రక్షించువాఁడవని చాల విని ఆశగాని నిన్నాశ్రయించితిని; నాకభయ మిచ్చి బ్రోవుమనుచున్నారు

(64) బృందావనసారంగ - ఆది.

ప. కమలాప్తకులకలశాబ్ధిచంద్ర - కావవయ్య నన్నుఁ గరుణాసముద్రా (క)

అ. కమలాకళత్ర కౌసల్యాసుపుత్ర - కమనీయగాత్ర కామారిమిత్ర (క)

చ. మును దాసులఁ బ్రోచిన దెల్లఁ జాల - విని నీచరణాశ్రితుఁడైతి నయ్య
కనికరంబున నాకభయమియ్యవయ్య - వనజలోచన శ్రీత్యాగరాజవినుత (క)

ప్రతిపదార్థము.

కమలా...చంద్ర

కమలాప్తకుల - తామర ప్రవ్వ లకు స్నేహితుఁడైన సూర్యునికులమను

కలశాబ్ధి - పాలసముద్రమునకు

చంద్ర - చంద్రునివంటివాఁడా

కరుణాసముద్రా - కృపా సముద్రుఁడా

కావవయ్య - కాపాడుమయ్య

(కమలాప్త)

కమలా కళత్ర - లక్ష్మీనాథుఁడా
కౌసల్యా సుపుత్ర - కౌసల్యయొక్క మంచికుమారుఁడా
కమనీయగాత్రా - మనోహరమైన దివ్య మంగళ విగ్రహ
మునగలవాఁడా
కామారిమిత్ర-మన్మథునికిశత్రువైన శివునికి స్నేహితుఁడా
(కమలాప్త)
వనజలోచన - కమలపత్రములవంటి కన్నులుగలవాఁడా
త్యాగరాజనుత - త్యాగరాజుచే నుతింపఁబడువాఁడా
మును - మునుపు
దాసులను - నీదు భక్తులను

ప్రోచినదెల్లఁ - కాపాడినదెల్లను
చాలకని - మెండుగ నాలకించి
నీ చరణాశ్రితుఁడు ఐతిని అయ్య - నీదు చరణములను
ఆశ్రయించిన వాఁడ నైతిని
కనికరంబునఁ - కరుణతో
నాకుఁ - నాకు
అభయము ఇయ్యవయ్య - భయములేని పదము
నియ్యవయ్య
(కమలాప్త)

విశేషార్థము:—'కమలాప్తకుల కలశాబ్ధి చంద్ర...కరుణా సముద్రా' అనుటచే, శ్రీరామా! సూర్యకులమున నున్న చక్రవర్తులలో నెవరును శరణుచొచ్చినవారిని విడిచిపెట్టినది లేదు. నీ వన్ననో, ఆ సూర్యకులమునకు పాలసముద్రమునకు చంద్రునిబోలి, నీదు సుగుణములచే

అగ్రగణ్యుఁడవై యున్నవాఁడవు. అట్టి నిన్నాశ్రయించిన నన్ను విడనాడుదువా ? విడనాడవను చున్నారు.



'కమలాకళత్రా...మిత్ర' అనుటచే, శ్రీరామా ! భక్తులువచ్చి నిన్నే యాశ్రయించుటకైన అన్ని సాధనములును నీయొద్దనే యున్నది అనుచున్నారు. ఎట్లనిన, 'కమలాకళత్ర' అనుటచే పురుష కారము చేయుటకు ముందుముందుగ వచ్చుచున్న తల్లియగు లక్ష్మికి భగవంతుఁడు సర్వసులభుఁడుగ నున్నవాఁడనియు ; 'కౌసల్యా సుపుత్రా' అనుటచే, 'కౌసల్యా సుప్రజా రామ' అని విశ్వామిత్రుఁడు కొనియాడినచందముగ, ఆత్మలాభమును కోరక లోక సంరక్షణమును గోరియే కౌసల్యచే కన్నబిడ్డఁడగుటచే ఆశ్రితులను రక్షించియే తీరుననియు ; 'కమనీయగాత్రా' అనుటచే, 'గంధర్వరాజప్రతిమం...పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' అనునటులు, అతి మనోహరమైన దివ్యమంగళ విగ్రహ సౌందర్యముచే పురుషుల మనస్సు నాకర్షించుటచే దర్శనయోగ్యుఁడనియు; 'కామారిమిత్రా' అనుటచే, భగవంతుఁడు తన కొడుకును దహించి అంగములేనివానినిగఁ జేసిన పరమశివునియందును వాని భక్తికి లోఁబడినవాఁడై ప్రీతిగ నుండుటచే, భక్తులయొక్క అపరాధ

విశేషములను తలఁపక వారు చేసిన స్వల్పభక్తికి మెచ్చి వారినిఁ గాపాడఁదగినవాఁ డనియు భావము. ఇట్లు పురుషకారము చేయుటకైన లక్ష్మియును, 'స్ఫురత్కిరీటాంగదహారకంఠి' అనునటులు సర్వాలంకృతమై భక్తుల మనస్సు నకహరింపఁదగినదియై యుండు దివ్యమంగళ విగ్రహమును, గొప్ప యపరాధముల నల్పముగను, అల్ప పుణ్యముల గొప్పగను గణించి రక్షించుటకై వాత్సల్యాది గుణములును, భక్తులను రక్షించుటయే తన యవతార ప్రయోజనము సంకల్పమును భగవంతుని యందు నెలకొనియుండుటచే, ఈభగవంతుఁడే ఆశ్రయింపఁ దగినవాఁడని అయ్యగారు ఆశ్రయించి నారని భావము.

'మునుదాసులను...త్యాగరాజనుత' అనుటచే, వనజలోచన! సర్వసత్త్వ మనోహరమైన వాఁడా! 'ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక...' అనునటులు ప్రహ్లాదాదులగు ననేక భక్తులను నీవు మున్ను కాపాడినది వినియే నిన్ను శరణుచొచ్చితిని, 'విభీషణోవా సుగ్రీవ యదివా రావణ స్స్వయమ్' అనునటులు, యోగ్యతాయోగ్యతల విచారము లేక కేవలము కృపావశుఁడవై కాపాడువాఁడవు కనుక సికరము న నా కిభయ మిథ్యావలయు ననుచున్నారని భావము.

బృందావన సారంగ రాగలక్షణము:—ఇది ఔడవరాగము. 22-వ మేళమైన ఖరహరప్రియయందుఁ బుట్టినది. శుద్ధమధ్యమ కైశికి నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

| ఆరోహణము. | అవరోహణము. |
|---|---|
| స రి మ ప ని స | స ని ప మ రి గ స. |

| | | |
|---|---|---|
| స. ; ; ; * రీ రిమా ; పా | మపనీ ; – నీ | \| పా పమరీమా |
| ; ; ; * కమలా ; ప్త | కు. ల ; – క | \| ల శా. . ధి |
| రిగాసా , * నిగరిమా ; పా | ,, | \| ,, |
| చంద్ర , * కమలా ; ప్త | ,, | \| ,, |
| ,, * ,, | ,, – సరీ | \| సనిపమరిమ |
| ,, * ,, | ,, – క . | \| ల.శా. . ధి |

నీ ; ; ; * రీ రీ మా ; మా | రిస్సుపా ; – మప | మారీ ; మా ||
; ; ; * మునుదా ; సు | ల. బ్రో ; – చి . | న దె ; ల్ల ||

రిగాసా , * స్నీషానీ ; స్నీ | సా , సా , రి | మాపా ; మా ||
చాల , * వి ని నీ ; చ | ర , ణా , శ్రి | తు డై ; తి ||

రీ , సా * షపనీపా ; మా | పా , నీ , – మప | నీసా ; నీ ||
న , య్యా * క నికరం ; బు | న , నా , – కభ | యమి ; య్యా ||

సా , సా ,, | ,, | ,, ||
న , య్యా ,, | ,, | ,, ||

సా , రీ సరి రి గ సా నీ | నిపానీ , – పని | సనిపా ; మా ||
వ , య్యా వన జ లో . చ | న . శ్రీ , – త్యా | గ . రా : జ ||

రీ , సా
ను , త (కమలాప్త)

అవతారిక:—ఈ కీర్తనమునందు త్యాగారు, శ్రీరామా! ఆశ్రితులను బ్రోచుటయందు నీకు సమానమైన వారెవరున్నారని, కొన్ని యుదాహరణముల నిచ్చి శరణాగతి చేయుచున్నారు.

(65) శ్రీరంజని - ఆది.

ప. బ్రోచువా రెవ్వరే - రఘుపతీ (బ్రో)

అ. నినువినా (బ్రోచు) శ్రీరామా - నెనరునం (బ్రోచు)
సకలలోక నాయక ! (బ్రోచు) నరవర నీ సరి (బ్రో)

చ. దేవేంద్రాదులు మెచ్చుటకు లంక - దయతో దాన మొసంగి సదా (బ్రో)

2. వాలి నొక్క కోల నేసి రవి - బాలుని రాజుగ గావించి చూచి (బ్రో)

3. మునిసవంబుఁ జూడ వెంటఁజని ఖల - మారీ చాదుల హతంబు చేసి (బ్రో)

4. భవాబ్ధి తరణోపాయ నేని - త్యాగరాజును కరంబిడి. (బ్రో)

## ప్రతిపదార్థము.

రఘుపతీ - రఘువంశమునందు శ్రేష్ఠుఁడా
ప్రోచువారు - కాపాడువారు
ఎవ్వరు ఏ - ఎవ్వరే
నినువినా - నిన్నుతప్ప
(ప్రోచువా రెవరే)
శ్రీరామా - శ్రీరామా!
నెనరునఁ - కరుణతో (ప్రోచువా రెవరే)
సకలలోక నాయక - అన్ని లోకములకును అధిపతియైన
వాఁడా (ప్రోచువా రెవరే)
నరవర - మనుజులలో శ్రేష్ఠుఁడా
నీసరి - నీవలె (ప్రోచువా రెవరే)
దేవేంద్రాదులు - దేవేంద్రుఁడు మొదలుగాఁ గల దేవత,
మెచ్చుటకుఁ - ఆశ్చర్యపడుటకై

లంకను - లంకాపట్టణమును
దయతోను - కృపతో
దానము ఒసంగి - దానముగ నిచ్చి
సదా - ఎల్లప్పుడును (ప్రోచువా రెవరే)
ముని - విశ్వామిత్రమునియొక్క
సవంబును - యాగంబును
చూడను - జాగ్రత్తగ చూచుటకై
వెంటను చని - ఆముని వెంటనేపోయి
ఖలమారీచాదులను - దుర్మార్గుఁడగు మారీచుఁడు అధిపతి
గాఁ గల రాక్షసులను
హతంబుచేసి - నాశముచేసి (ప్రోచువా రెవరే)
వాలిని - వాలిని
ఒక్కకోలను - ఒక అమ్మున

ఏసి - పడనైచి
రవిబాలునిఁ - సుగ్రీవుని
రాజుగఁ గావించి - రాజుగఁజేసి
చూచి - కటాక్షించి (ప్రోచువా రెవరే)
భవాబ్ధి తరణోపాయము - సంసార సముద్రమును

దాటుటకైన ఉపాయమును
నేరని - ఎఱుఁగని
త్యాగరాజును - త్యాగరాజును
కరంబు ఇడి - చేయి యిచ్చి (ప్రోచువా రెవరే)

విశేషార్థము:—ఈ కీర్తనయందుఁ గల ప్రయోగములన్నిటిచేతను, 'ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్ । రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా' అనునటులు అయ్యగారు శ్రీరామునియందు చేసిన సాంగమైన శరణాగతి వెల్లడియగుచున్నది.

'ప్రోచువా రెవరే ? రఘుపతీ ! నిన్నువినా' అను ప్రయోగములచే, 'పరా త్వత్తో గతిర్వీర పృథివ్యాం నోపపద్యతే । పరిపాలయ న స్సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ !' అనఁగా, ఓరామా ! ఈ లోకమునందు నిన్నుతప్ప మమ్ము కాపాడువాఁ డెవఁడును లేఁడు. మమ్ము రాక్షసబాధల నుండి రక్షించి పరిపాలనము సేయవలయును అని దండకారణ్యమున నుండు ఋషులు శ్రీరాముని శరణువొచ్చిన ప్రకారముగ అయ్యగారును శరణుఁ జొచ్చినారని భావము.

'నైవమర్హథమాం వక్తుమాజ్ఞప్తోఽహం తపస్వినామ్' అనఁగా, ఋషులారా! మీ శరణాగతిచేతనే నే నాజ్ఞాపింపఁ బడితిని; అని శ్రీరాముఁడు ఋషులకు చెప్పెను. ఇందులకు తాత్పర్య మేమనఁగా, పయిరులను కాపాడుట కృషికుని సొంతకార్యముగ నున్నటులు భక్తుని కాపాడుట భగవంతుని సొంతకార్యముగ నుండఁగ అందులకై ప్రార్థింప నక్కఱ లేదు. ఇట్టి విషయములో, భక్తుఁడు ప్రార్థింపక మునుపే కాపాడక పోతిమే! అని భగవంతుండు పరితపించును. కనుక, అయ్యగారును, 'నెనరున ప్రోచువా రెవరే' అనుచున్నారని భావము.

'సకల లోకనాయక నరవర' అనుటచే, 'ఏష ధాతా విధాతా చ సర్వేషాం ప్రాణినాం ప్రభుః। పరం హి పుండరీకాక్షా న్నభూతం నభవిష్యతి' అనునటులు సృష్టిస్థితులకు కారణమైనవాఁడుగను రక్షకుండు నగు శ్రీమన్నారాయణుఁడే రాముఁడై యవతరించెననియు; ఆ కారణముచే శరణ్యుఁడనియు భావము.

'దేవేంద్రాదులు...సదా' అనుటచే, 'సర్వలోక శరణ్యాయ...' ఇత్యాది వాక్యములయందు

చెప్పినట్లుగ శరణుజొచ్చిన విభీషణు నంగీకరించి, అప్పుడే దేవతలు సంతోషపడునటులు, 'దత్తం రాజ్య మిదం మయా' అని లంకాపట్టణమును విభీషణున కిచ్చిన శ్రీరామునివంటి రక్షకుం డెవండైనం గలడా ? అని భావము. ఇటులే 'మునిసవనంబు వాలినొక్కకోలనేసి' అను చరణములచే అయ్యగారు, ప్రాతికూల్య వర్జనమును నిరూపించి, 'భవాబ్ధి తరణోపాయము' అను చరణముచే రామునకు తప్ప రక్షకుండు లేడని దృఢచిత్తులై ఆత్మసమర్పణము చేసినారని భావము.

శ్రీరంజని రాగలక్షణము:—ఇది షాడవ వక్ర రాగము. పంచమము వర్జ్యము. 22-వ మేళమైన ఖరహరప్రియ జన్యము. చతుశ్శ్రుతి ఋషభ చతుశ్శ్రుతి ధైవతములు రాగచ్ఛాయాస్వరములు. ఎల్లప్పుడు గానము సేయందగినది.

| ఆరోహణము. | అవరోహణము. |
|---|---|
| స రి గ మ ధ ని సఁ. | సఁ ని ధ మ రి గ రి స. |

అవరోహణమందు, "సనిధమగరిస" అను, ప్రయోగము ఈ రాగమునకు వేంకటమఖిచేం జెప్పంబడియున్నది. వాడుకయందు ఈ ప్రయోగము సాధారణముగం గనంబడుచున్నది.

మగరిస - రిగమరిగస మరిగరిస మనిధనిస నిధమరిగస మొదలగు ప్రయోగములు రాగ రంజకములు.

ప. మారీగా ; - గారీ రీ ; - | సా ; ధ్యా | సారీగా ; ||
ప్రోచు ; - వారెవ్వ ; - | రే ; ర | ఘుపతీ ; ||
,, | ,, - రీ | గామాధా , ||
,, | ,, - ని |ను వి నా : ||
,, | ,, - రీ | గామానిధ ని ||
,, | ,, - శ్రీ | రామానెనరున ||
,, | ,, - రిగ | సుధాని - సానిధ ||
,, | ,, - సక | ల లోక - నాయక ||
,, | ,, - ధని | సని - ధనిసానిధ ||
,, | ,, - సర | సర - నీ . . సరి ||

చ. మారీ గా - రి గమా - రి గమదాధ | ని ని ధ నిసా ; | సే ని నీ - నిదధా ||
దేవేంద్రా - దలుమె - చ్చుటకలంక | దయతో. దా ; | నమొసం - గిసదా |

మారిగా మ - ధానిసా రీ - రీగమా | రిగమా - గరిసా | సెసెసని - సే నిధా ||
వాలినొక్క - కోలనేసి .. ర విబా | లునిరా - జుగగా | విం. . చి - చూ. చి ||

దధమ - రీ గ మా - రి గారి - సేసరిగ | మాధానీ సరీ | గరి సే - నీ , ధ ||
మునిస - వంబుజా - డ వెంట - జ నిఖల | మారీ చాదుల | హతంబు - చే, సి ||

ధసాసే - రిరిగా - మాగరీ - గారిసే | సాసని - గాగరి | నిసా ; ; - నిధ ||
భవాబ్ధి - త రంగ - పాయము - నే ర ని | త్యాగ - రా . జును | కరం ; ; - బిడి ||



అవతారిక:—ఈకీర్తనమునం దయ్యగారు; శ్రీరామా! స ంతర్యామివై యుండు నీవు నే నెంత :బెట్టి ఘోషించినను బదులు చెప్పకయే యున్నావే! ఇది తగునా? అనుచున్నారు.

(66 శ్రీరంజని - ఆది.

ప. మారుపల్కకున్నా వేమిరా - మా మనోరమణ (మా)

అ. జారచోరభజన చేసితినా - సాకేతసదన (మా)

చ. దూరభారమందు నా హృద - యార విందమందు నెలకొన
దారినెఱిఁగి సంతసిల్లినట్టి - త్యాగరాజనుత (మా)

ప్రతిపదార్థము.

మా మనోరమణ - లక్ష్మికి మనోహరమైనవాఁడా
మారుపల్క - కున్నావు - బదులుచెప్పకయే । ఉన్నావు
ఏమిరా - ఎందుకురా
సాకేతసదనా - అయోధ్య ఇల్లుగఁ గలవాఁడా
'జారచోర భజనచేసితినా'
జార - జారులయొక్క-కాని
చోర - చోరులయొక్క-కాని
భజన - సేవను
చేసితినా - ఒనర్చితినా
(మారుపల్క)
దూరభారమందుఁ - దవ్వుదాపులయం దు
నా - నాయొక్క

హృదయారవిందమందున్ - హృదయకమలమునందును
నెలకొనన్ - నెలకొనియుండుటకు
దారిన్ - మార్గమును
ఎఱిఁగి - తెలిసికొని

సంతసిల్లినట్టి - సంతుష్టుఁడైనట్టి
త్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడఁబడు
శ్రీరామా
(మారుపల్కకున్నావేమి)

విశేషార్థము:—'మారుపల్కకున్నావేమిరా? మా మనోరమణ!' అనుటచే, శ్రీరామా! మాతల్లియగు లక్ష్మీదేవిమనస్సునుకూడ నీ సుగుణములచే కొల్లగొనియుండువాఁడవు; అట్టి నీయొద్ద ఆశ్రితులను పలుకరించునట్టి గుణము లేక యుండునా? ఉండదు అట్లుండియు నే నెంత పిలిచినను బదులు చెప్పక యే యున్నావే! అదేమి? అనుచున్నారు. వెనుక నొక సమయంబున రావణునిచే నపహరింపఁబడిన సీత, 'జీవితం సుఖమర్థాంశ్చ ధర్మహేతోః పరిత్యజన్ । ప్రియాన్ మాం నాధర్మేణ మాం రాఘవ! న పశ్యసి' శ్రీరామా! ప్రాణము, సుఖము, ఐశ్వర్యము మున్నగు వానిగూడ ఆశ్రితులను కాపాడుట యను ధర్మమునకై లక్ష్యపెట్టను అని చెప్పిన నీవు, అధర్మముగ దశకంఠుఁడు నన్ను హరించుకొని పోవుటయును చూచుచుండక లేదుగదా? అని మొఱఁబెట్టినట్టుడు

పలుకకయే యుంటివిగా, సర్వాంతర్యామివగు నీకే ఆ సమాచారము తెలియకపోయెనని చెప్పుటకౌనా? నీవు తెలిసియే యూరకుంటివని నే చెప్పఁగలుగుదును. నిరాపరాధుఁడగు లక్ష్మణుని నిందలాడిన సీతను రక్షించుట కింత యవసరమేమి యని యుంటివేమో? నా మొఱలను వినక యుండుటకు నేనేమి యపరాధముచేసితిని? లోకమునందు జారులతోను చోరులతోను అధర్మమైన కార్యములను చేయుచు వేషముచే భజనపరులై తిరుగుచున్న వారివలె నటించితినా? లేక అట్టివారిని సేవించితినా? నన్నేల పలుకరించకౌనవు? అనుచున్నారని భావము.

'దూరభారమందు...నుత' అనుటచే, 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అనునటులు అణువందును మహత్తునందును నిండియుండు నీకు దవ్వుదాపుగలదా? మఱియు నీవు భక్తుల యొక్క హృదయమునందు వాసము చేయువాఁడవుగదా? అట్లుండునపుడు నేను పలికిన పలుకులు నీకు వినఁబడలేదని చెప్పఁగలుగుదువా? అట్లు లేనియెడల నాతో బదులు చెప్పక యుండుటకు కారణమేమి? నేనే యపరాధ మొనర్చితిని? అని యయ్యగారు శ్రీరామునితో వాదాడుచున్నారని భావము.

చ. మా , గ - రిగమా , - రి గ రి - రిగరిని | సా ; ; - సా | , నిసగరి - సరిగ ||
మా , రు - పల్కు , - కున్నా - వే.. మి | రా ; ; - మా | , మనో. - రమణ ||

2 మా , గ - రిగమగమ - | ,, | ,, ||
మా , రు - పల్కు . - | ,, | ,, ||

3 మా , గ - రిగమా , - ద నీ - ధానీనిదధా | మా ; ; - రీ , గ | మగ - రిగరి - సరి గ ||
మా , రు - పల్కు , - కున్నా - వే . . . మి | రా ; ; - మా , . | . మ - నో. - రమణ ||

4 ,, - ధ నీ - ధనిసనిధానీ | ధా ; ; - ధా , ని | సని - ధనిధ - ధానిసనిధ ||
,, - కున్నా - వే . . . . మి | రా ; ; - మా , . | . మ - నో . - ర మ.ణ. ||

5 ,, ,, | సా ; ; - నిరి | సని - ధనిస - నిధసనిధా ||
,, ,, | రా ; ; - మా | . మ - నో . - ర. మ. ణ ||

6 మా , గ - రిగమా , - ధ నీ - ధనిసని - ధనిసరి | రిగమారిగా-గరిరిస-ధనిసరి | సానీ-ధనిసా ; - ,, ||
మా , రు - పల్కు , - కున్నా - వే . . . - మి . . | ర . . ; . . . . . -మా . . | .మ -నో . ; - ,, ||

29

అ. , * సనిధ-ని నిసా,-గరిగా,-రిగమారిగా | శ్రీ ; ; - | ధా , ని - సా ; ; ||
, * జార-చో. ర ,-భజన ;-చే . . సిత | నా , ; - | . , . - . ; ; ||

2. రి - * సనిధ ,, | ,, | ధా,నిసానీ-సా,రిగారీ ||
. - * జా.ర ,, | ,, | . , . . - . , . . . ||

3. సరి * ,, | ,, | ధా,నిసానీ-సరిగరిసరిగరి ||
. . * ,, | ,, | . , . . . - . . . . . . . . ||

4. ,, * ,, | రీ ; ; - గరి | రిసనిస - ధని - ధనినిస ||
,, * ,, | . ; ; - సా. | కే. త. - సవ- న . . . ||

5. ,, * సనిధ - ,, | ,, - రిగమగ | గరిరిససని దా-ధానీనిదధా ||
,, * జా.ర- ,, | ,, - సా . . | కే. . . . తి . -స దన. . ||

౬. మామ - దాధ - నిధ - నీ ; ధనిసా నీధా | ధ మమ - మగరి - రిని | సా ; - రిగమమ ||
దూర - భార- మం - దు; నావ్యా. ద | యా. ర - విం ద - మం | దు ; - వెలకొన ||

, - ని ధనిసస - నిసరి - రిగమ  రీగాగరిరిస | రీ ; ; ,  ధా , ని  సా ; ; - ||
, - దారనెఱిగి  సంత - షి. ల్లి  న  . . | ట్రి ; ; ,  ; ; - ||
,, | ,, - గరి | రిసనిధ - ధానీనిదధా ||
,, | ,, - త్యా | గ . రా - జనుత . ||

(*) ఇచట అనపల్లవి సంగతులను పాడుకొనవలెను.



అవతారిక:— ఈకీర్తనమునం దయ్యగారు, శ్రీరామా! నేను డంబమునకైగాని ద్రవ్యార్జనమునకైగాని భక్తిచేయలేదు. శీతోష్ణములచేతను బాధనొందలేను. నీవు రక్షించినను ఉపేక్షించినను నీదు పాదముల విడువఁజాలను; అనుచున్నారు.

(67) శ్రీరంజని - ఆది.

ప. భువిని దాసుఁడను పేరాసచే - బొంకులాడితినా బుధమనోహరా (భు)

అ. అవివేకమానవులఁ గోరి కోరి యడ్డ - త్రొక్కఁ ద్రొక్కితినా బ్రోవవే (భు)

చ. చాలసౌఖ్యమో కష్టమో నేను - జాలిఁ జెందితినా సరివారిలోఁ
బాలముంచిన నీటముంచినఁ - బదములే గతి త్యాగరాజనుత (భు)

## ప్రతిపదార్థము.

భువిఁ - భూమియందు
నీదాసుఁడు అను - నీదు దాసుఁడనను
పేరాసచేఁ - పెద్ద ఆసచేత
బొంకులు ఆడితినా - అబద్ధములు పలికితినా
బుధ మనోహరా - ప్రపన్నుల మనస్సు నపహరించువాఁడా
అవివేక మానవులఁ - వివేకములేని మనుజులను
కోరికోరి - ప్రార్థించి ప్రార్థించి
అడ్డత్రోవఁ - చెడుదారిని
త్రొక్కితినా - నడచితినా

ప్రోవవే - కాపాడుమా
(భువిని దాసుఁడను)
చాల సౌఖ్యమో - చాల సుఖమో
కష్టమో - (లేక) కష్టమో
నేను - నేను
జాలిఁ - దుఃఖమును
చెందితినా - పొందితినా
సరివారిలోఁ - నాతో సమానమైన వారి ముంగల
పాలముంచినఁ - పాలయందు ముంచినను, కాపాడినను
నీట ముంచినఁ - నీటియందు ముంచినను, ఉపేక్షించినను

నీదు - నీయొక్క
పదములు ఏ - పాదములే

గతి - జీవనము
(భువిని దాసుఁడను)

విశేషార్థము:—'భువిని దాసుఁడను పేరాసచే బొంకులాడితినా' అనుటచే, రామా! ఇతరులను మోసపుచ్చుటకై నేను రామభక్తుఁడను అని వేషముఁబూని పొట్టపూచ్చుకొంటినా? ధనాశచే నీభక్తునిరీతి నడచితినా! లేను. పరులమెప్పులకు, నాపొట్టకు నీదాస్యమును జేయలేను. 'దాసభూతాస్స్వత స్సర్వేహ్యాత్మానః పరమాత్మనః' అనునటులు నీకు నాకు నెడతెగని ప్రాంత చుట్టఱికమును నే నిప్పుడు తెలిసికొన్నవాఁడను అని భావము.

'అవివేకమానవుల కోరికోరి' అనుటచే, నీయెడ భక్తిలేని పామరుల నాశ్రయించితినా? 'నాథే నః పురుషోత్తమే త్రిజగతామేకాధిపే చేతసా సేవ్యే స్వస్య ఫలస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి। యంకంచిత్ పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం సేవాయై మృగయామహే పరమహో మూకా వరాకా వయమ్' అనునటులు లోకనాథుఁడవై కోరినవారి కోరికల కోరినట్టు లొసఁగెడు నారాయణుఁడవు నీవుండఁగా నీ పురుషాధముల నాశ్రయించుట యెంత తెలివితక్కువ?

దాహపీడితుఁ డెవఁడు గంగానదీతీరమునందుఁ బావి త్రవ్వఁ బ్రయత్నించును ? అని భావము.

'అడ్డత్రోవఁ ద్రొక్కితినా' అనుటచే, 'దాసానుదాస చరమావధిదాస ఏషః' అనునటులు నిన్ను, నీదాసులను, నీదాసదాసులను, అనెడి మంచిత్రోవనువిడచి, 'నీయొక్క భక్తిలేనివాఁడు విధవముచే నింద్రుని బోలియున్నను వాని నాశ్రయింపుట యనెడి చెడుమార్గమునందు పొరపాటుచేనైనను పాదము నిడితినా ? లేదు అనిభావము.

'చాలసౌఖ్యమో కష్టమో నేను జాలిఁ జెందితినా' అనుటచే, 'సుఖదుఃఖే సమేకృత్వా' అనునటులును, 'యద్యద్భవ్యం భవతి భగవన్ పూర్వకర్మానురూపమ్' అనునటులును, కర్మానుగుణముగా వచ్చునట్టి సుఖదుఃఖముల రమ్మని పొమ్మని నే విచారపడనేల ? భారమంతయు నీదిగదా ? అని భావము.

'సరివారిలో' అనుటచే, నీదాస వర్గములో, 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనునటులు నీమాటప్రకారము, నాది, నేననుతలంపు లేనట్టి నిన్నాశ్రయించితిని. 'అహం త్వా సర్వపాపేభ్యో

మోక్షయిష్యామి' అనునటులు, అన్ని పాపముల విడఁగొట్టుట నీపని యని తలఁచి, 'పాలముంచి నన్' నాకు క్షీరాభిషేకము జేసినను, పై మాటకు మఱచి 'నీట ముంచినన్' నన్ను గంగలోఁ ద్రోసినను నేనేమి సేయువాఁడ? నీ సొత్తుకు గుఱించిన లాభనష్టములు నీవిగా నుండును గదా? హే త్యాగరాజనుత! నాకు నీ పదము లేగతి యని శరణుఁజొచ్చుచున్నారని భావము.

ప. ; ; ; * నిధమా – దా , ధా , | ధాధనిధని – ధా | , మ – మాశీగా ||
; ; ; * భువిని – దా , సు , | డ సు. . . – పే | , . . – రా . స ||
గరీ , ; * ,, | ధా – ధనిసా – నిధ | ధమ – ధమమగ – గా ||
చే. , ; * ,, | డ – సు. . – పే. , | . . – రా. – స ||
రి ; ; * రీ గామా ; గా | రిగమ – గరిప – నిధ | నీసా ; నీ ||
చే ; ; * బోంకులా ; డి | త్రి. . –. నా. – బాధ | పనో ; హ ||
సా ; ; *
రా ; ; * (భువిని) (ఇచట నిలుపవలయును)

| | | | | |
|---|---|---|---|---|
| శీ . గరిసి * నిపిని | మా | నిధనీ ; – నిధ | నీసా ; నీ | ‖ |
| న , . . * పదము.లే | గ | త. . ; – త్యా | గరా ; జ | ‖ |
| సాంసా ; * | | | | |
| ను త ; * (భూష) | | | | |



అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరామునికి సహ ధర్మచరిగ నుండి వానికి యశమును గలుగఁజేసిన సీతాదేవిని కొనియాడుచున్నారు.

(68) శ్రీరంజని - దేశాది.

ప సరి యెవ్వరే శ్రీజానకీ నీ (స)

అ పరమాత్మునికై గడిదేరి సదా - సిరులిచ్చుటకుఁ జేరి కొలిచిన నీ (స)

చ వనమందు భయంకరమైన తా - వున నిల్తునని మనసు దెలిసి

కనకాంగి యందందన రాజసుఖ - మును నిల్పఁ జేసితివె త్యాగరాజనుత (స)

ప్రతిపదార్థము.

శ్రీజానకీ - పంగిలికరమైన జనకునికూతురా
నీ - నీకు
సరి - సమానమైనవారు
ఎవ్వరు ఏ - ఎవ్వరే (ఎవరును లేరని భావము)
(సరి యెవ్వరే)
పరమాత్మునికై - పరమాత్ముఁడౌ శ్రీరామునికై
గడిదేరి - ప్రౌఢిమ గలిగి
సిరులిచ్చుటకును-శ్రీరామునికన్ని సంపదలుగలిగించుటకై
చేరికొలిచిన - శ్రీరామునితో సదా కూడుకొని పరిచర్య యొనర్చిన
నీ - నీకు
(సరియెవ్వరే)
కనకాంగి - పసిఁడివంటి మేనుగల సతీ!
త్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడఁబడు సీతా!
వనమందున - అరణ్యమునందు
భయంకరమైన - భీతిని గలుగఁజేయునట్టి
తావున - ప్రదేశమునందు
నిల్తువు అని - నిలిచియుందువనని (శ్రీరామా ! నీకు ప్రక్కల నే నిలిచి కొలుచు చుందునని)
మనసు తెలిసి - శ్రీరాముని సమ్మతి నెఱింగి
అందు అందును - అచ్చటచ్చట (శ్రీరాముఁడు సంచరించిన ప్రదేశములన్నిటియందును)
రాజసుఖంబును - రాజభోగమును
కలుగఁ జేసితి ఏ - శ్రీరాము డనుభవించునటులు చేసితివే
(నీ సరి యె రే)

విశేషార్థము:—'త్వం మాతా సర్వలోకస్య దేవదేవో హరిః పితా । త్వయైతద్విష్ణునా చాంబ జగద్వ్యాప్తం చరాచరమ్' అనఁగా, భగవంతుఁడు లోకములకు తండ్రియనియును, లక్ష్మీదేవి తల్లియనియును, వీ రిరువురిచేతను చరాచరములతోఁ గూడుకొనియున్న జగము వ్యాప్తమైయున్న దనియును శ్రీవిష్ణుపురాణమునందు చెప్పఁబడియున్నది. 'మాతృదేవో భవ' అను శ్రుతివాక్య ప్రకారముగ తల్లియే ప్రథమదైవ మగుచున్నది. 'మాతృత్వైకరూపాం శ్రియం ప్రపద్యతే మాతా హి హితాదపి పుత్రస్య ప్రియమేవ పశ్యతి । పితాతు భయం పశ్యతి । అతో దండధరత్వహీనత్వైవాపలంబన మస్యా దశాయామాసీత్' అనఁగా, తల్లి తనయునియందు ప్రియమును మాత్రము గమనించును; తండ్రియో యన్న తనయునియందు దోషాదోషములను గమనించుటచే దోషమునకై వానిని దండించును. అందుచేత శిక్షించు స్వభావము లేనిదగు నుండు తల్లియే తనయునికి ముఖ్యాశ్రయముగ నున్నది యని తాత్పర్యము. 'అస్తి కర్మార్హఫలదే పత్యౌ కృత్యద్వయం శ్రియః । నిగ్రహో ద్వారణం కాలే సధుక్షో మనుగ్రహో' అనఁగా, కర్మములకుఁ దగిన ఫలముల నిచ్చు భగవంతుఁడు, చేతనుని నిగ్రహించునప్పుడు అడ్డగించి వాని ననుగ్రహించుటకై

పురుష కార మొనర్పుగుణము తల్లియగు లక్ష్మీదేవియందే. కనుక భగవంతుని నాశ్రయించుటకన్న లక్ష్మీదేవి నాశ్రయించుట వరమైనదిగ నున్నది. మఱియు, 'యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుర్నాలం మాతుమియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః' అనునటులు, అంతులేని స్వభావగుణములచే భగవంతుని కెల్లప్పుడును ప్రియురాలుగ నుండు లక్ష్మీదేవియొక్క మహిమయును, భగవంతుని మహిమవలెనే అంతులేనిదియై, ఆ భగవంతుని వల్లను నెఱుఁగుటకు సాధ్యము కానిదియై యున్నది. 'శృణాతి నిఖిలం దోషం శ్రీణాతి చ గుణైర్జగత్ । శ్రియతే చాఖిలైర్నిత్యం శ్రయతే చ పరం పదమ్' అనునటులు, లక్ష్మీదేవి అన్ని దోషములను పోఁగొట్టి జగములను ఉజ్జీవింపఁజేసి అందఱిచేతను ఆశ్రయింపఁబడునదియై ముఖ్యప్రయోజనముగ నుండు భగవంతుని పొందియుండుటచేత ఈమెను ఆశ్రయించుట చేతనునకు పరమసులభముగను పరమప్రయోజనముగను ఉన్నది. ఇత్యాది కారణములచే, అయ్యగారును, 'శ్రీజానకీ! నీ సరియెవ్వరే?' అని కొనియాడినారని భావము.

'పరమాత్మునికె గడిదేరి సదా సిరు చుట్టుకుఁ జేరి కొలిచిన' 'నీ సరి యెవరే' అనుటచే,

'యస్యా వీక్ష్యముఖం, అఙ్గీకారైభిరాలోకైః, క్రీడసి శ్రీసమక్షమ్' మున్నగు వాక్యములచే, భగవంతుండు సృష్టి మున్నగు కార్యములను చేయునపుడు లక్ష్మియొక్క ముఖమును ఆమెయొక్క కంటి చూపులను చూచుచు తాను చేయు కార్యములను ఆమె ఆమోదించి సంతోషపడుచున్నదా అని గమనించుచున్నాడు. మఱియు భారతమునందు, 'కృత్వామత్స్థాని భూతాని చరాణి స్థావరాణిచ। ఏకాకీ విద్యయాసార్థం విహరిష్యే ద్విజోత్తమ' జంగమ స్థావరములుగ నున్న భూతములను నా యందున్నవిగా చేసికొని ఒక్కఁడుగ విద్యతోఁగూడ ఆటలాడఁ బోవుచున్నాను అని చెప్పఁబడి యున్నది. ఇందు, 'విద్యయాసార్థం' అను పదములచే, లక్ష్మితోఁగూడి ఆటలాడఁ బోయెనను, అను భావము వెల్లడి యగుచున్నది. శ్రీమద్రామాయణమునందు, 'తేనేయం స చ ధర్మాత్మా ముహూర్త మపి జీవతి' అనఁగా ఇట్లు పరస్పర మొకరివనన్ను ఒకరియొద్ద నుండుటచేతనే ఈ సీత రాముఁడును క్షణకాలమైనను ప్రాణముతో నున్నారని చెప్పఁబడియున్నది. పై నుదాహరించిన కారణములచేత భగవంతుఁడైన శ్రీరామునకు చేయు అన్ని కార్యములు సీతయొక్క ప్రోత్సాహము చేతనే చేయఁబడినదియై శ్రీరామునికి మహిమలను ఇచ్చెనని భావము.

'వనమంతు భయంకరమైన త్రోవను నిల్తునని' అనుటచే 'అహం దుర్గం గమిష్యామి వనం పురుషవర్జితమ్ । నానామృగగణాకీర్ణం శార్దూలవృకసేవితమ్॥ సుఖం వనే నివత్స్యామి యథైవ భవనే పితుః । అచింతయంతీ త్రీన్ లోకాన్ చింతయంతీ పతివ్రతమ్' అనుటలు, రాముని వనగమనసమయమునందు సీతాదేవి, శ్రీరామా! మనుష్య సంచారము లేనిదియు, నానా మృగములచే నిండినదియు నగు వనమునకు నేను నీతోడవచ్చి వనమును నాతండ్రి యిల్లువలెఁ దలఁచుచు, ముల్లోకములను లక్ష్యపెట్టక నీకు కైంకర్యమునే ప్రధానముగ చేయుచుందును; అని చెప్పితివిగదా! యని భావము.

'మనసుదెలిసి' అనుటచే, 'తాం పరిష్వజ్య బాహుభ్యాం, మనుగచ్ఛస్వ మాం భీరు సహధర్మచరీ భవ' అనునటులు, సీత, శ్రీరాముని ఆలింగనముచే వానిప్రీతి నెఱింగినదియై, 'నాతోకూడ వచ్చి ధర్మములను సలుపుము' అని శ్రీరాముఁడు చెప్పినమాటచే కృతార్థురాలుగ నైతివే యని అయ్యగారు సంతోషించుచున్నారనిభావము.

'కనకాంగి యందందు రాజసుఖంబును గల్గఁజేసితివే' అనుటచే, 'శేష శేషాశనాదిసర్వాం

పరిజనమ్' అనుటలు; అనంత గరుడ విష్వక్సేనాది సమస్త పరివారములు మాత్రమేగాక శ్రీ వైకుంఠమునందుఁ గల సమస్త నిత్య సూరులును శ్రీ మహాలక్ష్మికి పరిజనులై యుండుటవల్లను, ఆ పరివారములను వారివారి కైంకర్యములయందు ఆజ్ఞాపించు కార్యము లక్ష్మిదిగ నున్నందువల్లను, సీతాదేవి, వనమునకుఁ బోవుచున్న తన నాథునికి నిత్యోపచారములను సలిపి వనమును వైకుంఠముగ చేయుటకై శ్రీరాముని వెంటనే చని పరమోపచారములు సలిపె నని భావము.

| | | |
|---|---|---|
| ప. ; ; ; * రీగాగరీనీ | సా ; ; - రీ | గామా ; గా ‖ |
| ; ; ; * పరి యొక్క | రే ; ; - శ్రీ | . జా ; న ‖ |
| రిగమా ; * ,, | ,, | గామాదా ధను ‖ |
| కి నీ ; * ,, | ,, | . జా న . ‖ |
| రిగమా ; * ,, | ,, | గావ నిదా ధను ‖ |
| కి. నీ ; * ,, | ,, | . జా. . న . ‖ |
| రిగమా ; * ,, | ,, | గామానీనీ ‖ |
| కి. నీ ; * ,, | ,, | . జా. న ‖ |

అ. ; ; ; * ధానీని ధామా | దా , ధా , - ధా | నీసా ; నీ |
; ; ; * పరవ . . శ్మ | ని , కై , - గ | డి దే ; ర ||

సాం సాం ; * ,, | ,, | నీ - ధనిసానీ ||
స దా ; * ,, | ,, | డి - దే . . ర ||

,, * ,, | ధా , నీ , - సని | సా - రిగగరిసా ||
,, * ,, | ని , కై , - గ . | డి - దే . . . ర ||

సాంసనిధమ * ,, | నిధానీ , - ధా | నీసా ; నీ ||
స దా . . * ,, | ని . కై , - గ | డి దే ; ర ||

సాంసాం ; * ,, | ,, - నీ | సారీ , రీ ||
స దా ; * ,, | ,, - గ | డి దే , ర ||

గాంగా ; * రిగమ గా ; గా | గరిరీ ; - సరి | గరిసారిసా ||
స దా ; * సి . రు . ) ; చ్చు | టను ; - జే . | ర . కొలిచి ||

30

సీనినిదధమ *
వ . నీ. . . * (సరి యెవ్వరే

చ. ; ; ; * దాదాదా ; ధా | ధామా ; - మా | గాగరిరీసా ||
; ; ; * వ న్న మం ; దు | భ యం ; - క | రమై. . ||

రిగామా , * దాదాధనిసా నీ | దాదధమా - మా | ,, ||
న . తా , * వ నమం . దు | భయం . - క | ,, ||

,, * దాధాదనిసనిధమ | ధమమాగా - మా | ,, ||
,, * వ న మం. . దు. | భ . యం. - క | ,, ||

,, * రీ గామా గా | మా ధా - ధని | సా నీసనినిధ ||
,, * వు న ని ల్లో | న . ని - మ. | న ను. . తె. ||

దాధామా * ధానీనిదధామా | దా , ధా , - ధా | నీసా ; నీ ||
లి సి . * క నకాం. గి | యం, దం , - దు | నరా ; జ ||

సాసా ; * ,, | ని ధానీ , - ని | సారీ ; రీ ||
సు ఖం ; * | యం దం . , - దు | న రా , జ ||

గాగా ; * రిగమరిగా గా | గరిరీ ; - సరి | గరి - సారిసా ||
సు ఖం ; * బు సు . గ ల్గ | జే . సి ; - తి . | నే . - త్యా . గ ||

స నీనిధమ
రా. జనుత (సా యెవ్వరే)



అవతారిక:—ఈకీర్తనము నందయ్యగారు, శ్రీరామా! ఉపనిష దర్థములను, మృదంగము, తాళము మున్నగు గానోపయోగ సాధనములతోఁ శ్రుతిలయములతో సుస్వరపు గానమునందమర్చి పాడి నిన్ను సాక్షాత్కరించుకొనుచున్నట్టి వాఁడేగదా పరమభాగ్యమును బడసినవాఁ డనుచున్నారు.

## (69) శ్రీరంజని - రూపకము.

ప. సొగసుగా మృదంగ తాళము జతగూర్చి నిను - సొక్క జేయు ధీరుఁ డెవ్వఁడో (సొ)

అ. నిగమ శిరోర్థము గల్గిన - నిజ వాక్కులతో స్వరశుద్ధముతో (సొ)

చ. యతి విశ్రమ సద్భక్తి ని - రతి ద్రాక్షారస నవరస.
యుత కృతిచే భజియించు - యుక్తి త్యాగరాజు తరమా శ్రీరామ (సొ)

### ప్రతిపదార్థము.

సొగసుగాన్ - చక్కఁగ
మృదంగ తాళము - మృదంగ తాళములను
జతగూర్చి - జతపఱచి (నాదములు పొందుఁబట్టుగాఁ జేసి)
నినున్ - నిన్ను
సొక్కన్ చేయు - సోకు పుచ్చు
ధీరుఁడు - సామర్థ్యము గలవాఁడు
ఎవ్వఁడు ఓ - ఎవ్వఁడో

నిగమ శిరోర్థము - వేదములకు శిరస్సుగనుండు ఉపనిష
త్తుల యర్థము
గల్గిన - కలిగియున్న (నిండియున్న)
నిజవాక్కులతోన్ - శ్రేయమైన పలుకులతో
స్వరశుద్ధముతోన్ - సుస్వరముతోను
(సొగసుగా)
'యతి...కృతిచే'

యతి - కవిత్వమునందుగల విశ్రమస్థానముతోను
విశ్రమ - గానమునందుగల విరామములతోను
సద్భక్తి - మంచి భక్తితోను
నిరతి - మిక్కిలి ఆసక్తితోను
ద్రాక్షారస - ద్రాక్షారస పాకముతోను
నవరస - నవరసములతోను

యుత - కూడుకొనియుండు
కృతిచే - కీర్తనములచేత
భజియించు - భజనముచేయు
యుక్తి - ఉపాయము
త్యాగరాజునితరమా - త్యాగరాజునకు శక్యమా
(సా సుగా)

విశేషార్థము:—'సొగసుగా మృదంగ తాళము జతఁగూర్చి సొక్కఁజేయు ధీరుఁడెవ్వఁడో' అనుటచే, భగవంతుఁడు సర్వ విద్యావిశారదుఁడును, సామగానలోలుఁడునై యుండుటచే అట్టివాని ముంగల, గానమున కుపకారిగ నుండు మృదంగాది వాద్యములను సొంపుగఁజేర్చి, 'శ్రుతులు బెరయుట స్వరముల చొప్పువిడక। చాల శుద్ధతఁ గనుట దోషములఁబాసి। ఘనవిధముగాన షడ్జంబుఁగలసి మెలసి' అనునటులు గానముచేసి వాని సొక్కఁజేయు వాఁడొకఁడు గలఁడా? అను చున్నారు.

'నిగమ శిరోర్థము...శుద్ధముతో' అనుటచే, భగవంతుఁడు నిందితంబైన భాషాగానముచే

తృప్తి నొందుటలేదనియును, ఉపనిషదర్థములతోఁ గూడుకొన్న స్వీయమైన వాక్యములతో, అనఁగా ఉపనిషత్తులు మొఱఁబెట్టి చెప్పునట్టి భగవంతునియొక్క గుణానుభవమునకైన పంక్తులతో చేయఁబడు సుస్వరపు గానము చేతనే తృప్తి నొందుచున్నాఁడనియు; అట్టి గానమును చేయు మనుజుఁడు అరుదుగ నున్నాఁడనియు భావము.

'యతి విశ్రమ...యుక్తి త్యాగరాజు తరమా' అనుటచే, యతి ప్రాసములతోను, 'పద సందర్భము లర్థకల్పనలు శబ్దస్ఫూర్తు లుత్ప్రేక్షలింపు దలిర్పఁగ' అనునటులు, పద సందర్భము లు మున్నగు లక్షణములతోను, గానపద్ధతి ప్రకారముగఁ గల విరామములతోను, భక్తితోను, అనురాగముతోను, ద్రాక్షా పాకముతోను, 'రసైః శృంగార కారుణ్య హాస్య వీరభయానకైః। రౌద్రాదిభిశ్చ సంయుక్తమ్' అనునటులు, నవరసములతోను గూడుకొనియుండు కృతులచే శ్రీరాముని సాక్షాత్కరించుటకైన యుక్తి త్యాగరాజు వశము కాదనుచున్నారు. అనఁగా, వెనుక నొక పర్యాయము శ్రీనారదుఁడును వాల్మీకియును చేసినయుక్తిని ప్రకటించుచున్నారు. ఎట్లనిన, వాల్మీక్యాశ్రమమునందుఁ బుట్టి పెరిఁగిన కుశలవులకు నారదుఁడు, వాల్మీకిచే రచింపఁబడిన రామాయణమును

వీణయందు వాయించుటకై, శిక్షించి, వాల్మీకితో శ్రీరాముని సన్నిధికి పంపించఁగా, ఆవటులును వాల్మీకిమునిశిష్యు లనిపించుకొని శ్రీరాముని సముఖమున రామాయణమును బాడిన సమయంబున, 'స్వరములయారె మేలుశ్రుతి చాగురె మూర్ఛన కంపితంబు బా । పురే. బళిరయ్య డాల్ నెఱసెఁ బో నెఱ మీటు కులంబుతాయి య । ద్దిర స్ఫురితంబు లమ్మయని తేనియ లొల్కెడి వారిపాటలా । దర్శణము మీఱఁగా విని ముదంబొదవఁ బతిమెచ్చె నెమ్మదిన్' అనునటులు, శ్రీరాముఁడు ఆ గానములో సొక్కి సోలి పరవశుఁడయ్యెను. అట్లు శ్రీరాముని సొక్కఁజేయుటకైన యుక్తి మునిశ్రేష్ఠులైన నారద వాల్మీక్యాదులకు తెలియునేగాని దీనుఁడైన త్యాగరాజునకు తెలియునా? మఱియు గురువులయొద్ద నేర్చిన విషయములను సొంపుగ పొందుపఱచి భక్తితోను, అనురాగముతోను సర్వజన సమ్మోహనముగ గానము చేయుశక్తి యా కుశలవులకే గాని ఈ త్యాగరాజునకుఁ గలదా? అయ్యగారి భావము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప. సీథా | \| నీ - నిదథామా | \|\| మాగా | \| గా గరిరీస్రీ | \|\| |
| సాగ - | \| సు- గా వ్మ | \|\| దం. | \| * . తా. క్ష | \|\| |

సా ; ; ; - ధా॒ నీ॒ || సా ; రీ గామా ; ||
ము ; ; ; - జ త || గా ; : . ర్చి ; . ||

(౨) నీధా నీ - సనిధామా || రిగమా గా - గరిరీనీ ||
సాగ సు - గా. . || దం . గ - తా.శ ||

సా ; | ; ; - నీసా || రీ ; గాగమా ||
ము ; | ; ; - జ త || గా; . . ర్చి ||

(౩) ధనిసా | నీ - సనిధామా || రిగమా గా - గరిరీనీ ||
సా.గ | సు- గా. . వృ || దం . గ - తా.శ ||

సా ; | ; ; - నీసా || రీ ; గాగామా ; ||
ము ; | ; ; - జ త || గా; . . ర్చి ; ||

(౪) ధనిసరి | సా - రిసనిధమా || రిగమా గా - గరిరీనీ ||
సా.గ . | సు - గా. . . వృ || దం . గ - తా.శ ||

| | | | | | |
|---|---|---|---|---|---|
| | సా ; | ; ; - స్నీసా | ‖ రిఁరిస | మా - గమధనిసా | ‖ |
| | ము ; | ; ; - జత | ‖ గా . | . - ర్చి . . . | ‖ |
| (5) | ధ ని స రి | సా - రిసనిధమా | ‖ గమధా | మా - మగగరిస్నీ | ‖ |
| | సా . గ . | సు - గా . . . వృ | ‖ దం . | గ - తా . . . శ | ‖ |
| | సా ; | ; ; - రీసా | ‖ సనిధా | మా - గమధనిసా | ‖ |
| | ము ; | ; ; - జత | ‖ గా . | . - ర్చి . . . | ‖ |
| (6) | రిగసరి | నిస - రిసనిధమా | ‖ గమధా | మా - మగగరిసా | ‖ |
| | సా . గ . | సు . - గా . . వృ | ‖ దం . . | గ - తా . . . శ | ‖ |
| | స్నీసరిగ | మా - గమధనిసా | ‖ రిగరి స | రిస - నిసని - నిధమ | ‖ |
| | ము . . | . - జ . . . త | ‖ గా . . | . . . - ర్చి . . . . . | ‖ |
| 7) | నీ ధా | నీ - సదధామా | ‖ గమగా | గా - గరిరిస్నీ | ‖ |
| | సా గ | సు - గా . వృ | ‖ దం . . | గ - తా శ | ‖ |

సా ; | ; ; - నీసా | | గా - గామా ; ||
ము ; | ; ; - జత || ఞా | ర్చి - నిన్న ; ||

నీ ధా | నీ సాం ; నీ || నిద | మా - మా గా గా ||
సా . | కృ - జే ; యు || ధీ. | రు - డై . న్వ ||

x రిరి | ; ; - ; ; || సా | ; ; - ; ; ||
డో . . | ; ; - ; ; || . | ; ; - ; ; ||

అ. నీధా | నీసా సా ; || ధానీ | సా ; సానీ ||
ని x | మశి రో ; || ర్గము | క ; ల్గిన ||

సా ; | ; ; - ; ; || ధనిసని | ధానీనిధమా ||
. ; | ; ; - ; ; || .... | ..... ||

నీధా | నీసా సా ; || ధానీ | సా ; సానీ ||
నిx | మశి రో ; | ర్గము | క ; ల్గిన ||

గారి | గాగరిరీసా || గారీ | గామామామా ||
రతి | ద్రా...క్షా || రస | నవ రస ||

నీ ధా | నీనీసా ; || ధానీ | సా ; రీరీ ||
యుత | కృతిచే ; || భజి | యిం ; . చు ||

రిగమా | గా - గరిరీసా || నీ , ధ | మా - గామాధా ||
యు . | క్తి - త్యా . గ || రా , జు | . - తనమా ||

నీధా | నీ - నిదధామా ||
పాగ | ను- గా . మృ || దంగ తాళము

అవతారిక: — ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరామా! జితేంద్రియుండై, నీయందు నిలిపిన మనస్సు గలవాండై, తైలధారవలె నెడతెగని ధ్యానముచే నిన్నుం గొలువలేక యున్నానని నన్ను నాదరిమ్పుము అని ప్రార్థించుచున్నారు.

(70) దేవమనోహరి - దేశాది.

ప. కన్నతండ్రి నాపైఁ గరుణమానకే - గాసి తాళలేనే కరుణమానకే (క)

అ. నిన్నుఁజేయుపనులు నేఁడుగాక వే - తెన్నలేదనుచు వేమాఱులకు (క)

చ. ఎదురుతానను ఇంగితంబెఱిఁగి - చెదరనీక పంచేంద్రియములంచి నిన్ను
వదలలేని ధైర్యశాలిగాఁడని - మదనకోటిరూప త్యాగరాజనుత (క)

ప్రతిపదార్థము.

కన్నతండ్రి - నన్నుఁగన్నతండ్రీ (కన్నతండ్రీ)
నాపైఁ - నామీఁద (ఈ త్యాగరాజు)
కరుణ - పక్షమును నిన్నుఁజేయుపనులు - నిన్నుఁ జేసినట్టి కార్యములనే
మానకే - వదలవలదు సుమా నేఁడుగాక - నేఁటికిని చేయుటయేగాక
గాసితాళలేనే - ఈ సంసారమందలి యలసటను జడ వేఱెన్నలేదు-మఱియొక గొప్పకార్యమున్నదని తలఁపలేదు
లేకయున్నానురా అనుచు - అనుచు (అని వ్యాజముచేత)

నేమాటలకు_ - పలుమాటలకును
(కన్నతండ్రి)
మదనకోటిరూపా - కోటి మన్మథులకు సమానమైన రూపముగలవాఁడా
త్యాగరాజనుత - త్యాగరాజుచే నుతింపఁబడినవాఁడా
ఎదురు - నీవు (భగవంతుఁడు)
తాను - నేను (జీవుఁడు)
అను - అనునట్టి
ఇంగితంబు - తారతమ్యమును

ఎఱింగి - తెలిసికొని
చెదరనీక - చెదరిపోవ నియ్యక
పంచేంద్రియము - ఇంద్రియ పంచకమును
అణఁచి - అణఁగఁద్రొక్కి
నిన్నుఁ_ - నిన్ను (స్వామివగు నిన్ను)
వదలలేని - ఎప్పుడును వదలలేక యుండునట్టి
ధైర్యశాలి - ధైర్యముగలవాఁడు
కాఁడు అని - ఈత్యాగరాజు కాఁడని
(కన్నతండ్రి)

విశేషార్థము:—'కన్నతండ్రి నాపైఁ గరుణమానకే' అనుటచే, 'పితాహమస్య జగతః, పితా హిలోకస్య చరాచరస్య' మున్నగు వాక్యములచే భగవంతుఁడే ముఖ్యమైన తండ్రిగ నుండుట చేతను, పుత్రుని క్షేమము కొఱకై తండ్రి సన్మార్గమునందు వానిని శిక్షించి గొప్పవానినిగఁ జేయునటులే భగవంతుఁడును, జీవుని కటాక్షించి ముక్తునిగాఁ జేయువాఁ డగుటచేతను, అయ్య

గారు, కన్నతండ్రీ! నీవు నాయందలి కరుణతో నన్ను కటాక్షించి మంచిమార్గమున చేర్చక పోయినచో మఱియొకండు కార్యమును చేయునా? ఈ భవబాధతాళలేక యున్నాను; శీఘ్రముగ రక్షింపుమనుచున్నారు.

'నిన్నుఁ జేయుపనులు...లేదనుచు' అనుటచే, శ్రీరామా! ఈ త్యాగరాజు నిన్ను చేసినట్టి ఆహార నిద్రాదివ్యవహారములనే సేఁతను చేయుచున్నాఁడు; ఇట్టి పామరుఁ డెట్లు ఈ సంసారమును దాఁటి మంచి మార్గము నవలంబించును? అని అజాగ్రత్తగ నుందువేని నీ కొడుకు చెడిపోవును గదా? ఆనష్టము నీదే గదా? అని భావము.

'వేమాటలకుఁ గన్నతండ్రీ' అనుటచే, శ్రీరామా! నేను మంచితోవ ననుసరించక చెడి పోదునేని నీవేగదా నాకు మఱియొకజన్మ మియ్యవలెను. నీ సొంతబిడ్డను నీవే పలుమాఱు కనికని అప్రయోజకునిఁగ చేయుదువేని, కొడుకును మంచిమార్గమునం దిడని అప్రయోజకుఁడని లోకులు నిన్నే దూఱుదురు. కనుక కరుణతో నన్నేలుము అని భావము.

'ఏమని పొగడుదురా...త్యాగరాజనుత' అనుటచే, పరమాత్మ, జీవాత్మ అను తారతమ్యముల నెఱిఁగి ఇంద్రియ నిగ్రహముచే యోగము నభ్యసించుటకు గురుప్రసాదము కావలసియున్నది. నీ వన్నిటా తండ్రిరూపమై యుండక, 'మహాపురుషాల లోకానాం గురుర్నారాయణో గురుః' అను నటుల, సర్వలోకములకును గురువుగ నుండుటచే నాకును గురువుగ నున్నావు. అట్టి నీవు నన్ను మంచిమార్గమునందు శిక్షించి రక్షింపక పోయినచో బ్రహ్మవిద్యల నేనెట్లు ఎఱుఁగుదును యోగమార్గముల నెఱుఁగలేనివాఁడని నన్ను నీవు విడనాడితివేని నిన్ను తండ్రిగను గురువుగను బడసిన నాకు గత్యంతర మెద్దియును లేదు. కనుక కృపావశుఁడవై కాపాడు మనుచున్నారని భావము.

దేవమనోహరి రాగలక్షణము:—ఇది షాడవ వక్రరాగము. 22-వ మేళమునందుఁ బుట్టినది. చతుశ్శ్రుతి ఋషభ శుద్ధ మధ్యమ కైశికీ నిషాదములు ఛాయా స్వరములు. గాంధారము వర్జ్యము. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

| ఆరోహణము. | అవరోహణము. |
| --- | --- |
| స రి మ ప ధ ని స | స ని ధ ని ప మ రి స. |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ప. ; | ; | ; | * | పామాకీ మా | \| | రి , సా , - రి రి | \| మాపా ; మా | \|\| |
| ; | ; | ; | * | క న్నతం డ్రి | \| | నా, పై , - గరు | \| ణ మా ; న | \|\| |
| 2 పా ; | ; | | * | ,, | \| | ,, | \| ,, | \|\| |
| కే ; | ; | | * | ,, | \| | ,, | \| ,, | \|\| |
| 3 రిమపా ; | | | * | ,, | \| | ,, | \| ,, | \|\| |
| కే . | ; | | * | ,, | \| | ,, | \| ,, | \|\| |
| 4 రిమపమపా | | | * | ,, | \| | ,, | \| మాపా ; ధా | \|\| |
| కే. . . . | | | * | ,, | \| | ,, | \| ణ మా ; న | \|\| |
| 5 పధనిధసీ | | | * | ,, | \| | ,, | \| మా - పాధని ధానీ | \|\| |
| కే. . . . | | | * | .. | \| | ,, | \| ణ - మా. . . న | \|\| |
| 6 సనిధనిపమ | | | * | ,, | \| | రి శిసా ; - గస | \| సా - సాం ; సాం | \|\| |
| కే. . . . . | | | * | ,, | \| | నా, పై ; - గరు | \| ణ - మా ; న | \|\| |

31

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 7 | సనిధానీ | * | ,, | ,, - రిరి | \| రీ - సరిమారీ | \|\| |
| | కే. . . | * | ,, | ,, - కరు | \| ణ - మా. . న | \|\| |
| 8 | రిసనిధనీ, | * | ,, | రి మరిసన్నిస - రిమ | \| పాధనిసారీ | \|\| |
| | కే. . . . | * | ,, | నా. పై. . . - గరు | \| ణ మా . న | \|\| |
| 9 | రిసనిధనీ | * | ,, | ప మరిసన్నిస - రిమ | \| రిమ - పధనిసరీ; | \|\| |
| | కే. . . . | * | ,, | నా. పై. - గరు | \| ణ - మా. . న | \|\| |
| 10 | రిసనిధనీ | * | ,, | రీ , సా , - రిమ | \| రిమ - పాపామా | \|\| |
| | కే. . . . | * | ,, | నా, పై - గరు | \| ణ. - మా . న | \|\| |
| 11 | ధనిపా | * | ధనిపా - పమరీమా | రీ , సా - రి రి | \| మా - పాధానీ | \|\| |
| | కే. . | * | గా.సి - తా. . ళ | ళే , నే - కరు | \| ణ - మా . న | \|\| |
| 12 | రిసనిధనీ | * | పామారీ ; మా | రీ , సా , - రి రి | \| మాపా , మా | \|\| |
| | కే. . . . | * | క న్నతం; డ్రి | నా, పై , - గరు | \| ణ మా ; న | \|\| |
| | పా ; | * | | | | |
| | కే ; | * | (ఇచ్చట నిలుపవలయును, | | | |

అ. ; ; ; * రీరీ రీ ; రీ | సరీమా ; - గస | నీ - ధా ; నీ ||
; ; ; * నిన్న జే ; యు | పములు ; - జే. | డు - గా ; క |

పా ; ; * ,, | సరీమరీమా - రీస | ,, |
వే ; ; * ,, | పనులు . . - నే | ,, |

,, * పమరీమా ; పా | ధనిసా ; - సని | ధనిపా ; మా |
,, * రె. న్నలే ; ద | ను. చు ; - వే. | . . మా ; రు |

పమరిసరిరు *
ల. కు... * (కన్నడ్రేడి)

చ. ; ; ; * పమమాపా ; మా | రిమపా - రీ | మాపధనిధనీ
; ; ; * ఎదురు తా ; న | నా. . - ఇం | గి లేం. . . బె

పా , మా , * ధనిపామారీమా | సరిసా , - రి రి | మా - పా ; ధా
జేం , గి , * చెదర నీ . క | పంచేం ; - గ్రియ | మ - ణ ; చి

నినీపా , * రిరిరీరీ ; రీ | స్వరీమా ; - రీస | నీధా ; నీ
ని. న్నా , * కదలలే , ని | హై గ్రీ | లి గా ; డ |

పా ; ; * ,, స్రీమరీమా - రీస ,, ||
ని ; ; * ,, క్రైస్త్ర . . - శా. ,, ||
,, * పమరీమా ; పా ధనిసా ; - సని ధనిసా ; మా ||
,, * మదసకో , టి రూపా , - త్యా గ. రా ; జ ||
పమరిసరిమ *
నత... * (కన్నతండ్రి)

అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరామా! నీవు లోకనాథుండ వగుటచే, నీ వల్ల చేయుటకు శక్యముకాని పని యేదియును లేదు. నీదు సర్వాధికారముచే అఘటిత ఘటనము లను ఈ యవతారము నందు చేయుచుక పోయినను, ఆశ్రిత రక్షకత్వమే గొప్పబిరుదుగ వహించిన చక్రవర్తులు గల సూర్యకులములో నీ వవతరించి నందువలన నీవు కులబిరుదమునైనను కాపాడు గానుటకై నిన్నాశ్రయించిన నన్నుం బ్రోవుమనుచున్నారు.

## (71) దేవమనోహరి - రూపకము.

ప. కులబిరుదును బ్రోచు - కొమ్మ్ర రమ్మ్ర (కు)

అ. ఇలఁగల భూదేవ సురా - దుల కాధారుఁడ వగు నీవు (కు)

చ. నిగమాగమచర నీకు - నిత్యమంగళము కల్గు
వగసేయకు శ్రీరామ - వందిత త్యాగరాజ (కు)

### ప్రతిపదార్థము.

కులబిరుదును - నీ సూర్యవంశపు బిరుదును
బ్రోచుకొమ్మ్ర - కాపాడుకొనుము
రమ్మ్ర - వచ్చి నన్నురక్షింపుము
ఇలన్ - భూమియందు
కల - ఉండునట్టి
'భూదేవ సురాదులకు'
భూదేవ - బ్రాహ్మణులకును

సురాదులకున్ - స్వర్గమునందున్న దేవతాదులకును
ఆధారుఁడవగు - రక్షకుఁడుగ నున్నట్టి
నీవు - నీవు
(నీ కులబిరుదును బ్రోచుకొమ్మ్ర)
నిగమాగమచర - వేదాగమములందు సంచరించువాఁడా
శ్రీరామా - శ్రీరామా
వంద్రిత త్యాగరాజ - త్యాగరాజుచే నుతింపఁబడినవాఁడా

వగసేయదు - హితములేని కార్యములను చేయరాదు ; నీ శ్రేయమంగళము కలుగుగాక - స్థిరమైన శుభములు కలుగును
నీకుగా - నీకు (కులబిరుదు).

విశేషార్థము:—'కులబిరుదును బ్రోచుకొమ్ము' అనుటచే, శ్రీరామా! 'కారణత్వం నియన్తృత్వం సుహృత్త్వం స్వామితా హరేః । వాత్సల్య మితి షట్చైతే కంఠోక్తా ఇహ సద్గుణాః' అనునటులు, ఆదికారణుఁడై యుండుట, నియమనము చేయువాఁడుగ నుండుట, సుహృత్తుగ నుండుట, స్వామిగనుండుట, ప్రీతిగలిగినవాఁడై యుండుట అను ఈ ఐదును నీదు కల్యాణగుణములుగ నున్నవి. ఈ కారణముచే కృపావశుఁడవై, యోగ్యాయోగ్య విచారము చేయకయే నీ వెవరిని రక్షించినను నిన్నాక్షేపించువారు లేరు. అట్టి నీ సర్వాధికారముచు ఈ రామావతారమునందు సలుపుట కిష్టము లేక ధర్మాధర్మ విచార మొనర్చి కాపాడవలయు నను తలంపు నీకుఁ గలిగియుండినను, నీ పూర్వులైన సూర్యవంశపు చక్రవర్తులు బిరుదుగ వహించిన ఆశ్రిత రక్షకత్వమును గమనించియైన నిన్నాశ్రయించిన నన్ను కాపాడుటకు త్వరపడుము అనుచున్నారని భావము.

'ఇలఁగల భూదేవ...నీవు' అనుటచే, 'సతు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః'

అనునటులు, బ్రహ్మవిద్య గల వారలను రక్షించుటకై నీవు ప్రతిజ్ఞ చేసి యున్నావు. అటులే దేవతలకును అభయమిచ్చియున్నావు. 'రక్షితా జీవలోకస్య స్వజనస్యచ రక్షితా' అనునటులు, నిన్నాశ్రయించిన వారలను రక్షించువాఁడవుగ నున్నావు. కనుక నిన్నాశ్రయించిన నన్ను కాపాడుము అనుచున్నారని భావము.

'నిగమాగమచర...త్యాగరాజా' అనుటచే, శ్రీరామా! నీవు వేదాగమములయందు సంచరించువాఁడవు. నీను ఆజ్ఞారూపముగనుండు ఆవేదము, 'నాన్యః పంథా అయనాయ విద్యతే' అనునటులు, నీవు తప్ప జీవునికి అన్యగతి లేదని మొఱలిడుచున్నది; అందుచేతనే నేనును నీకు సదా వందనములు సలుపుచున్నాను. దాసులను బ్రోచుటయే కల్యాణగుణముగ నెంచు నీవు నన్ను కాపాడి కల్యాణముఁగలవాఁడవగుము అని అయ్యగారు ప్రార్థించుచున్నారని భావము.

| | | | | |
|---|---|---|---|---|
| ప. సారీ | \| సారీమాపా | \|\| ధా ; | \| ధా , నీ ; | \|\| |
| వల | \| చిరాను ను | \|\| బ్రో ; | \| . , చు; | \|\| |
| పధనీ | \| పామా రీ ; | \|\| రీమా | \| మాపా రీ , | \|\| |
| న్నో.. | \| . . మున్ము; | \|\| ర . | \| . . మ్ము, | \|\| |

సాకీ సాకీమాపా || దా | ధా ; నీ ; ||
కల బిరుదు ను || బ్రో | . ; చు; ||

పధనీ పామా - రిమపధ || నీ ; | పా ; - పమరీ ||
కో . . . - మ్మ . . || ర ; | . ; - మ్మ. ||

సారీ సారీమాపా || దా | ధా ; నీ ; ||
కల బిరుదు ను || బ్రో ; | . ; చు; ||

పధనీ పామారిమపధ || నీపమ | రిమపమ రీ ; ||
కో . . . మ్మ . . || ర . . | . . . . మ్మ; ||

సారీ సారీమాపా || పా ; | పా ; పమరీ ||
కల బిరుదు ను || బ్రో ; | . ; చు. . ||

మపధని పామారిమపధ || నీపమ | రిమపమ రీ ; ||
కో. . . మ్మ . . || ర . . | . . . . మ్మ; ||

సారీ సారీమాపా || మాపమ | రిగపమ రీ ; ||
కల బిరుదు ను || బ్రో | . . . . చు ; ||

సా నీ | ధానిపామా || పమరీ | రి మపమరీ ||
ఫం , | దితత్యా || గ . . | రా . . . జ ||



అవతారిక:— ఈ కీర్తనమున దయ్యగారు, శ్రీరామా! ఈ రామావతారమును నీ వెవరిని రక్షించుట కెత్తితివి? అని ప్రశ్న చేయుచున్నారు.

(72) దేవమనోహరి - చాపు.

ప ఎవరికై యవతార మెత్తితివో - ఇపుడైన దెలుపవయ్యా రామ నీ (ఎ)

అ. అవనికి రమ్మని పిలిచిన మహరా - జెవరో వానికి మ్రొక్కెద రామ (ఎ)

చ వేదవర్ణనీయమౌ నామముతో - విధిశక్రులకు మేల్మియగు రూపముతో

మోదసదనమగు పటుచరితముతో - మునిరాజ వేషికఁ త్యాగరాజనుత నీ (ఎ)

## ప్రతిపదార్థము

రామయ్యా - శ్రీరామా

ఏవరికై - ఎవరిని ప్రోచుటకై

అవతారము - ఈ రామావతారమును

ఎత్తితివి ఓ - పూనుకొంటివో

ఇప్పుడైనన్ - ఇప్పుడైనను

తెలుపవయ్యా - తెలియజేయుమయ్యా

(ఎవరికై)

అవనికిన్ - భూమికి

రమ్మని అని - రమ్మని

పిలిచిన - ఆహ్వానముచేసిన

మహారాజు - మహాప్రభువు

ఎవడు ఓ - ఎవ్వడో

వానికిన్ - అతనికి

మ్రొక్కెదన్ - నమస్కరించెదను

రామా - శ్రీరామా (ఎవరికై)

వేదవర్ణనీయము ఔ - వేదములచే వర్ణింపదగినదగు

నామముతోన్ - పేరుతో

విధిరుద్రులకున్ - బ్రహ్మరుద్రులకు

మేల్మియగు - శ్రేష్ఠమగు

రూపముతోన్ - దివ్యసుందర విగ్రహముతో

మోదకరము అగు - ఆనందమునకు ఆటపట్టగు

పటుచరితముతోన్ - దివ్యచరిత్రముతో

త్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడబడు రామా

మునిరాజవేషివై - ఋషియొక్కయు రాజుయొక్కయు

వేషమును ధరించినవాడవుగ

(ఎవరికై యవతారమెత్తితివో)

విశేషార్థము :— 'మునిరాజవేషిగ......ఎవరికై యవతార మెత్తితివో ?' అనుటచే, 'ఉటజే రామ మాసీనం జటామండలధారిణమ్ । తంతు కృష్ణాజినధరం చీరవల్కలవాససమ్ । దదర్శ రామ మాసీన మభితః పావకోపమమ్ ॥ సింహస్కంధం మహాబాహుం పుండరీకనిభేక్షణమ్ । పృథివ్యా స్సాగరాంతాయా భర్తారం ధర్మచారిణమ్ ॥ ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణమివ శాశ్వతమ్ । స్థండిలే దర్భసంస్తీర్ణే సీతయా లక్ష్మణేనచ ॥' అనునటులు, ఋషులవలె జటామండలధారిగను, కృష్ణాజినమును నారవస్త్రమును ధరించినవాఁడుగను, అగ్నివలెజ్వలించువాఁడుగను; రాజులవలె సింహమువంటి మూపురము గలవాఁడుగను, తెల్లతామరలవంటి కన్నులు గలవాఁడుగను, సముద్రముపఱకుఁ గల భూమికంతటికిని భర్తగ నుండువాఁడును, ధర్మము నాచరించువాఁడుగను, చతుర్ముఖబ్రహ్మవలె చలింపక యుండువాఁడును, అగు రాముఁడు, నేలను దర్భాసనముపండు సీతాసమేతుఁడై చిత్రకూట పర్వతమునందు వేంచేసియున్న సన్నివేశమును అయ్యగారు ధ్యానయోగముచే అనుభవించి, శ్రీరామా! ఇట్లు మునిరాజ వేషముతో ఈ చిత్రకూటపర్వతముమీఁద కొలువమరి యుండు నీ వెవరికై యవతారము నెత్తితివి? అని ప్రశ్నచేయుచున్నారు. అనఁగా, నీవు దశరథుని

యొక్క పుత్రకామమును పూర్తి చేయుటకై యవతరించినవాఁడ వైనచో రాజవేషముతో నుండి అయోధ్యను పాలనముచేయుచుందువు. అట్లుగాక, విశ్వామిత్రునివలె, అడవులయందు తపము చేయు ఋషులతోఁ గలసి యుండి ఋషిధర్మము నాచరించుటకై వచ్చినవాఁడవైన చో, భార్యయగు సీతాదేవి, తమ్ముఁడగు లక్ష్మణుఁడు వీరిరువురిని వెంటఁ బెట్టుకొనకయు, చేతులయందు విల్లును అమ్మును బూనకయు నుండవలయును; శత్రు సంహారము చేయుటకై యవతరించి యుండినచో అంత లకు కావలసిన సైన్యములను వెంటఁ బెట్టుకొని రావలయును; దరిద్రులను కాపాడుటకై వచ్చిన వాఁడ వైనచో మెండుగ ద్రవ్యమును గట్టుకొని దరిద్రు లుండుతావునకు పోవలయును; అందుకైన ధనమును నీయొద్ద లేదు; ఇట్లు ఒకటి కొకటి సంబంధము లేని స్థితులచే నీ వెవరిని కాపాడుటకై లేక యెవరిని అణఁగఁద్రొక్కుటకై అవతరించితివో తెలియ లేదు. అయోధ్యను వదలి యీ వేషముతో నిక్కడ నున్నావే! ఇప్పుడైన నా కెఱుఁగఁ జెప్పుమనుచున్నారు.

'అవనికి రమ్మని...మ్రొక్కెద' అనుటచే, శ్రీరామా! నిన్ను భూమియందు అవతరించుమని ప్రార్థించి పిలిచిన వాఁ డెవఁడుగ నుండినను సరియే; వాని పాదములను నేను శిరస్సునందు

వహించుచున్నా రనుచున్నారు. అనఁగా, భగవంతుఁడు దుష్టనిగ్రహ శిష్ట పరిపాలనములకై భూమి యం దవతరించుచున్నాఁడు. కనుక శ్రీరాముని యవతారమువల్ల లోకములకు క్షేమముగలుగునని యెఱిఁగి ప్రార్థించినవాఁడు పరమ ధార్మికుఁడై యుండువాఁడు కనుక అట్టివానికి అయ్యగారు నమస్కరించుటకు ప్రీతిగలిగి యున్నారని భావము.

'వేదవర్ణనీయమౌ నామముతో...చరితముతో' అనుటచే, శ్రీరామా! నీ నామ మన్నచో, భక్తులు, స్మరణము చేయుటకు మిగుల సుఖమైనదిగను భవసాగరమును దాఁటించునదిగను ఉన్నది. నీ దివ్య మంగళ విగ్రహమన్నచో, 'వైదేహీం లక్ష్మణం రామం నేత్రైరనిమిషైరివ ఆశ్చర్యభూతాన్ దదృశుః సర్వే తే వనచారిణః' అనునటుల, దర్శించువారు తెప్పవేయక అత్యాశ్చర్యముగఁ జూడఁ దగినదియై మనోజ్ఞమై యున్నది. నీ చరిత్ర మన్నచో పరమయోగ్యమైనదిగను పావనము చేయునదిగను ఉన్నది. ఈ కారణములచేత నీవు నీ భక్తులకు తృప్తి పఱచుటకనియే ఈ యవతారము నెత్తుకొని యున్నావని నమ్ముచున్నాఁడను. అట్లు కాదేని ఇట్టి స్వరూపగుణ విభూతులతో నావానిఁ బ్రోచుటకై లేక కొట్టుటకై యవతరించితివి? తెలియఁ జెప్పుమని ప్రార్థించుచున్నారని భావము.

ని నీ | ధానీ || సనీ | ధనిసా || రిమా | రీసరీ || మమా | రీ ; ||
మో. | ద స || దవ | మ, గు || ప టు | చ. రి || త ము | తో ; ||
సనీ | ధానీ || పా , | పామా || రి మా | రీసా || రిమా | పాధా ||
ముని | రాజ || వే , | షి గ || ద్యా. | గరా || జ. | ను త ||



అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు, జీవన్ముక్తులుగాని వారలకు మోక్షము గలుగ నుచున్నారు.

(73) సారమతి - ఆది.

ప. మోక్షముగలదా భువిలో జీవ - న్ముక్తులు కానివారలకు (మో)

అ. సాక్షాత్కార నీ సద్భక్తి - సంగీతజ్ఞాన విహీనులకు (మో)

చ. ప్రాణానలసంయోగమువలనఁ - బ్రణవనాదము సప్తస్వరములై పరఁగె
వీణావాదనలోలుఁడౌ శివుమనో - విధమెఱుఁగరు త్యాగరాజవినుత (మో)

## ప్రతిపదార్థము.

*నవిలో౯ - భూమియందు
జీవన్ముక్తులు కానివారలకు౯ - జీవించియుండునపుడే సంబంధమును తొలఁగించికొననివారలకు
మోక్షముగలదా - (మృతి నొందినతరువాత) పునస్థానము గలదా ?
సాక్షాత్కార - ప్రత్యక్షుఁడగు దైవమా (శ్రీరామా)
నీ - నీ యొక్క
'సద్భక్తి...విహీనులకు'
సద్భక్తి - మంచిభక్తితోఁ గూడుకొన్న
సంగీత జ్ఞాన విహీనులకు౯ - సంగీత జ్ఞానము లేనివారికి (మోక్షముగలదా)

ప్రాణానల సంయోగమువలన - ప్రాణవాయువును అగ్నియును కూడుటచే
ప్రణవనాదము - 'ఓం' అను ప్రణవముయొక్క ధ్వని
సప్తస్వరములై - ఏడుస్వరములై
పరగ౯ - ప్రవర్తిల్లెను
వీణా వాదన లోలుఁడవు - వీణను వాయించుట యందు అనురాగము గలిగియుండు
శివు - శివునియొక్క
మనోధమ౯ - మనోభావమును
ఎఱుఁగరు - తెలిసికొనలేరు
త్యాగరాజనుత - త్యాగరాజుచే నుతింపఁబడు శ్రీరామా (మోక్షముగలదా)

విశేషార్థము:— మోక్షముగల ...కానివా రు' అనుటచే, జీవుఁడు జీవించియుండు

నపుడే లోకమునందుఁ గల సంబంధమును త్యజించినవాఁడై యుండవలయును. తామరాకు మీఁద నుండు జలము ఆ యాకు నంటకయే యుండునటులు జీవన్ముక్తుఁడైనవాఁడు లోకమునందు జీవించియుండి అందఱితో సహవాసము చేయుచుండినను విషయములందు ఆసక్తి లేనివాఁడై, జితేంద్రియుఁడై, జితక్రోధుఁడై యుండును. అట్టివానికే మోక్షము గలుగును. అట్లుగాక భూమియందుండువఱకు ఆశాపరవశుఁడై యుండినవానికి చచ్చినతరువాత దేనిచేతనైనను మోక్షము గలుగునని చెప్పుటకు వీలు లేదనుచున్నారు.

'సాక్షాత్కార...విహీనులకు' అనుటచే, భక్తితో భజనము చేయువారలను భగవంతుఁడు ప్రత్యక్షముగవచ్చి యనుగ్రహించుచున్నాఁడని యును, భక్తి లేని సంగీత మెట్టిదైనను అందుకు భగవంతుఁడు వశ్యపడఁడు కావున అట్టి సంగీతమును పాడుటచే ముక్తిని బడయుట సాధ్యము కాదనుచున్నారు.

'ప్రాణానల...వినుత' ..................... మోక్షగంధిజమారు ............ తినా చిత్తేన హృత్పంకజే
ఇత్యాది పంక్తులయందు చెప ..................., యోగాధార ............ యిలాంటిలో మూలా

ధారమునందుండు బ్రహ్మగ్రంథియను చతుర్దశ దళ చక్రమునందుఁ బుట్టు సూక్ష్మాగ్నితో ప్రాణవాయువు సేరుటచే నా ప్రాణవాయు వందుచే ప్రేరేపింపఁబడినదియై, నాభిహృదయ కంఠ ముల మూలముగ బయలు వెడలి నాదమగుచున్నది. ఈ నాదమునుండియే స్వరములుపుట్టి గాన యోగ్యముగ నున్నవి. ప్రణవమును శిరముగఁ గొన్న వేదములును స్వరములనే యంగముగఁ బడసియున్నవి. ఈ స్వరములచే నైన భక్తిపూర్వకమైన గానము మోక్షము నిచ్చుచున్నది. ఇట్టి రహస్యములను పరమ భాగవతుఁడైన శివుఁ డెఱింగియే భగవంతుని గుణానుభవములను పాడి తన వీణయందు వాయించి సదా గానలోలుఁడై వెలయుచున్నాఁడు. ఈ విషయము నెఱుఁగకయే పామరులు అప్రయోజకమైన భాషాగానమును చేయుచున్నారు. ఇట్టివారలకు మోక్ష మెప్పుడును గలుగదనుచున్నారని భావము.

సారమతి రాగలక్షణము:—ఇది సంపూర్ణ ఔడవరాగము. 22-వ మేళమునందు జన్యము. 20-వ మేళమునందు జన్యమని కొందఱమతము. అవరోహణమునందు పంచమ గాంధారములు వర్జ్యములు. శుద్ధ మధ్యమ కైశికీ నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడును గానము చేయఁదగినది.

; * సా , నీ , ధా - పా - ధా | ; - నీసనినీ ; - ధానిధ | ధమ - మగగా - గరి ||
; * సం , గీ , త - జ్ఞా ; న | ; - వి , , ; - ప్రీ . | . . - ను. ల - కు. ||

గరి *
. . * (మోక్షము)

చ. ; * పా , పా , - పాపా - పధనీ | ; - ని నీగమా | మామామగగా ||
; * ప్రా , ణా , - న ల - సం. | ; - యో .గ ము | వ ల న. . ||

; * నినిధామా - మగగా - రిగసా | ; - నిసారిసా | రిగమా ; ; ||
; * ప్రణవనా - దము . - స. ప్త | ; - స్వరములై | పరగె ; ; ||

; * నిసా రీ , - సగగా - రీగసా | ; - నిసా - రీగసా | సనినీ - సధమా ||
; * వీ . ణా , - వా. . - ద . న | ; - లో. - లుడౌ. | శి . వు - మ. నో ||

; * పపాదధా - నీనీ - పధనిధ | సా - నీసనినీ ; - ధానిద | ధమ - మగగా - రిగ ||
; * వి ధ మెఱు - గఱు - త్యా . | గ - రా . . ; - జ . . | . . - వి . ను - త. ||

ఓ *

. * (మోక్షము)



అవతారిక:—ఈ కీర్తనమునం దయ్యగారు, శ్రీరాముఁడు సరయూనదిలోని ఓడయందు సీతతో విహరించుచుండిన సన్నివేశమును ధ్యానయోగముచే ననుభవించి విన్నవించిన విషయ-మును జ్ఞాపకము చేయుచున్నారు.

(74) మనోహరి - రూపకము.

ప. పరితాపము కని యాడిన - పలుకుల మఱచితివో (పరి)

అ. సరిలేనిసీతతో - సరయూ మధ్యంబున నా (పరి)

చ. వరమగు బంగరుఓడను - మెఱయుచుఁ బది పూటలపైఁ

గరుణించెద ననుచును శ్రీకే - గనులను త్యాగరాజుని (పరి)

ప్రతిపదార్థము

సరిలేని - సాటిలేని
సీతతోఁ - సీతాదేవితో
సరయూ మధ్యంబునఁ - సరయూనది మధ్యలో నీవు ఉండి
నా - నాయొక్క
పరితాపము - కష్టములను
కని - చూచి
ఆడిన - చెప్పిన
పలుకులఁ - మాటలను
మఱచితివో - మఱచిపోతివో
వరము అగు - శ్లాఘ్యమైన
బంగరు ఓడను - స్వర్ణమయమైన పడవయందు
మెఱయుచుఁ - ప్రకాశించుచు
పదిపూటలపైఁ - పదిపూటలకు పైని
కరుణించెదను - 'త్యాగరాజా! నిన్ను రక్షించెదను
అనుచుఁ - అనిపలికి
క్రేగనుఁను - కడకంటితో
త్యాగరాజుని - త్యాగరాజుయొక్క
(పరితాపము గనియాడిన పలుకుల మఱచితివో)

విశేషార్థము — అయ్యగారు లోకాంతరము నలంకరించుటకు అయిదు దినము లుండి అయ్యగారి ధ్యానకాలమున శ్రీరాముఁడు తాను సీతాసమేతుఁడై సరయూనదియం దో

ణీయమైన పడవయందు విహరించుచుండునటుల్లు సేవ నొసంగెను. అప్పుడు అయ్యగారు తన నిర్యాణసమయమును గురించి శ్రీరాముని ప్రశ్న చేయఁగా, శ్రీరాముఁడును పదిపూటలపై తన సాయుజ్యము నయ్యగారి కిచ్చునటులు వాగ్దానము చేసెను. ఆ నిర్యాణదినము వచ్చినపుడు శ్రీరాముని ప్రత్యక్షముగ సేవింపఁదలఁచి అయ్యగారు ఈ కీర్తనముపాడి, శ్రీరామా! పదిపూటలపై నేను ప్రత్యక్షముగ వచ్చి నిన్ను నాస్థానమునకుఁ దోడ్కొని పోయెదనని సరయూనది మధ్యమునందు సీతాదేవితో నుండునపుడు చెప్పినమాటలను మఱవక వచ్చి నన్నేలుమని ప్రార్థించుచున్నారని భావము.

మనోహరి రాగలక్షణము:—ఇది వక్రషాడవరాగము. 22-వ మేళమునందు జన్యము. నిషాధము వర్జ్యము. సాధారణ గాంధార చతుశ్శ్రుతి ధైవతములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

| ఆరోహణము. | అవరోహణము, |
|---|---|
| స గ రి గ మ ప ధ స. | స ధ ప మ గ రి స. |

| | | | |
|---|---|---|---|
| ధపధా | సా ; రీరీ . | ॥ సగరిగ | మా గాగరిరీ ॥ |
| గ . రు | ణిం ; చెద | ॥ న . ను. | చు నన్ బ్రో . ॥ |
| రిగమగ | గరిరీ - సా ; | ॥ సా ; | సా - సధప ప ॥ |
| గ , ను . | ల . న్న - త్యా; | ॥ గ ; | రా - జా. ని . । |

అవతారిక —ఇం దయ్యగారు, శ్రీరామా! నీకును నీ దాసులకును గల యెడతెగని బాంధవ్యమును గమనింపకయే చులకనగఁ జూచుచున్నావే! ఇది న్యాయమా? అనుచున్నారు.

(75) కన్నడగౌళ - ఆది.

ప. ఓరచూపు చూచుట న్యాయమా - ఓ రఘూత్తమ నీవంటి వానికి (ఓ)

అ. నీరజాక్ష మును నీ దాసులకు నీకేటి - వావులు దెలుపవే (ఓ)

చ. మానము లేదా నీకుఁ దోఁచలేక పో - యిన వైనమేమి పుణ్యాపమా

దీనరక్షకా శ్రితమానవ సం - తాన గానలోల త్యాగరాజనుత (ఓ)

## ప్రతిపదార్థము

ఓ రఘూత్తమా - ఓ రఘుశ్రేష్ఠుఁడా
నీవంటివానికిఁ - రక్షకుఁడవైన నీకు
ఓరచూపు చూచుట-నీదాసులను చులకనగచూచుట
న్యాయమా - ధర్మమా
నీరజాక్ష - కమల పత్రములవంటి కన్నులు గలవాఁడ
మును - పూర్వము
నీదాసులకుఁ - నీభక్తులకును
నీవుఁ - నీవును
ఏటివావులు - ఎట్టి బాంధవ్యము గలదో
తెల్పవే - తెలియఁజెప్పుమా
మానము - గౌరవము
ఇంచుకైనఁ - కొంచెమైనను
నీవుఁ - నీవు
తోఁచలేక పోయిన - మనస్సునందు తగులకపోయిన
వైనమేమి - కారణమేమి
పుణ్యరూపమా - పుణ్యమే రూపముగాఁ గలవాఁడా
దీనరక్షకా - దీనులను రక్షించువాఁడా
శ్రితమానవ సంతాన - ఆశ్రయించినవారికి పుత్రరత్నమా
గానలోల - సామగానలోలుఁడా
త్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడఁబడు రామా
(ఓరచూపు చూచుట న్యాయమా)

విశేషార్థము:—'పితా త్వం మాతా త్వం దయిత తనయస్త్వం ప్రియసుహృత్త్వమేవ త్వం మిత్రం గురురసి గతిశ్చాసి జగతామ్' అను టులను, 'పితామహస్య జగతో　పితామహః

అనునటులును భగవంతుండు తల్లిగను, తండ్రిగను, మిత్రుడుగను, సుతుడుగను, వంశమున్నకల చెలికాడుగను, గురువుగను, పొందదగినవాడుగను ఉండుటచేత, అయ్యో యగాధ, శ్రీరామా! నిన్నాశ్రయించిన వారలకు మాత్రమేగాక జగమునందుండు వారలకందఱికిని అన్ని విధములయందును ముఖ్యమైనబంధువు నీవై యుండియును, నీకును నీదాసులకును గల బాంధవ్యమును ఎఱుంగని వానివలె నీ భక్తులను చులకనగా చూచుచున్నావే! దీనరక్షకుండవు, ఆశ్రితమానవ సంతనుడను అని పెద్దపేరులను మాత్రమిడుకొని వానికి విరోధమైన మార్గమునందుఁ బోవుచున్నావే ఇందువలనఁ గలిగెడి యవమానము నీకు తెలియకపోవుటకు కారణమేమి? మఱియు, 'రామ కమలపత్రాక్షః' అనునటులు, కమలపత్రములవలెనున్న కన్నులను పెట్టుకొని ఓరచూపు చూచుచున్నావే! ఆహా! ఇదియేమి అన్యాయమనుచున్నారని భావము.

కన్నడగౌళ రాగలక్షణము:—షాడవ షాడవరాగము. 22 వ మేళమైన ఖరహరప్రియయందు జన్యము. ఆరోహణమందు కైశికీ నిషాదమును, అవరోహణమందు సాధారణ గాంధారమును రాగచ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

ఆరోహణము. సరిగమపనిస.

అవరోహణము. సనిధపమగస.

సరిగమగస - మగసనిధా - సరిగసధ - రిగసనిధపమ - పమగస - నిధనిసగస అను ప్రయోగములు రాగరంజకమైనవి.

స ; ; ; * రీగామా ; పా పా - నిధ పమ - పా ; మా ||
; ; ; * ఓరచూ ; పు చూ - చు. ట . న్యా ; య ||

గా , పా , * ,, , రిగమప నిధ ,, ||
మా , . , * ,, , చూ . . - చు ,, ||

,, * ,, మపనీ . - నిధ ,, ||
,, * ,, చూ . . చు. ,, ||

,, * సాసాసా ; సా సనీ ; . నిధ పమ పా ; మా ||
,, * ఓ ర ఘూ ; త్త మ్మ నీ , కం టి. వా ; ని . ||

గా , సా , *
కీ , . , * (ఓరచూపు)

పా ; ; * పానీసా ; సా | రిగమా ; - మా | గాసా ; నీ ||
మా ; ; * దీ నర ; క్షు | కా . ; - శ్రి | త మా ; న ||

సనిధా ; * పనీసా ; సా | సనినీ ; - నిధ | పమపా ; మా ||
వ . సం ; * తానగా ; న | లో.ల ; - త్యా | గ . రా ; జ ||

గా , పా , *
ను , త , * (ఓరమాపు)

